కం. పాద ప్రక్షాళకుఁడై
యాదట వసియించునట్టి యభ్యాగతులన్
దాఁ దోడ్కొని చని యర్చ్యా
పాదకుఁడై భోజనమ్ము పంక్తి నిడఁ దగున్.

వ. అంతకు మున్న యొనర్పం దగు దేవపూజాక్రమంబు వినుండు.

సీ. ఘన శంఖ చక్రలాంఛన మష్టదళ పద్మ
భానురాలంకార బంధురమును
బహుదివ్య గంధ ధూప ప్రసవామోద
మగునట్టి పీఠి కల్యాణ రజత
తామ్ర శిలా మృత్స్న దారు మయంబుల
నైన శ్రీహరిమూర్తి నావహించి
రంగవల్లీ వితానాంగణము విచిత్ర
విహితమౌ దేవతా గృహమునందుఁ

తే.గీ. బ్రాహ్మ్యముండును శుచియునై పరమ నియతి
సమతఁ జిత్తంబు హరిపదాబ్జముల నిల్పి
భద్ర సంశోభితాసన ప్రౌఢి నమరి
మాతృకాంగ కరన్యాస రీతి మెఱయ.

ఉ. అచ్చట నష్టదిక్పతుల నావహనం బొనరించి రాక్షసా
త్యచ్ఛయవర్గముల్ దొలఁగ నూర్ధ్వగ దేవత లెల్ల రాఁగ భా
స్వచ్ఛలనాత్తఘంటిక ధ్రువమ్ముగ మ్రోయఁగఁ జేసి దిక్కులన్
హెచ్చు నిజాసనస్థితికి నింతయు బంధనముల్ ఘటింపుచున్.

కం. కలశమునందుఁ ద్రిమూర్తులఁ
గల త్రిదశులఁ దీర్ఘ పయోశులు గలుగన్ మంత్రో
క్తుల నావహించి శంఖము
జలజాహిత దైవతముగ సమకూర్పఁ దగున్.

తే.గీ. శంఖ చక్ర గదాపద్మ శార్ఙ్గ హస్తు
నిందిరా సుందరీ సదా మందిరాంక
చారు కౌస్తుభ వక్షు నీరేరుహాక్షు
నవ్య దరహాసవదను ధ్యానం బొనర్చి

కం. శాంతు ననంతుని లోకా
క్రాంతు రమాకాంతు భక్తగణవంతుఁ గళా
వంతు మహోదాంతుఁ గుణ
వంతుని నా వాహనంబు వలయుం జేయన్.

తే.గీ. అఖిల జీవాంతరస్థు మహానుభావు
నణువునకు కొద్దిగొప్పకు నధికమైన
యట్టి విభునకు రత్నసింహాసనంబు
నార్యుఁ డిడ నగు భక్తి తాత్పర్యములను.

కం. ఆద్యుం డాగమచయ సం
వేద్యుఁడు నిజభక్త సుజన వివిధామయ స
ద్వైద్యుఁడగు విష్ణుమూర్తికిఁ
బాద్య సమర్పణము సేయఁ బాటి బుధులకున్.

కం. నీరేజ భవాండమ్ములు
నీరనిమగ్నమగునపుడు నిద్రారతిచే
నారాయణుఁడగు హరికి సు
ధీ రతి నర్ఘ్యంబొసంగు తెఱఁగొప్పమరున్.

కం. ఆ చతురానన రుద్రులు
వాచంయమివరులు నెన్న వాంఛించినచో
వాచామగోచరుండగు
నాచతురున కొసఁగవలయు నాచమనమ్ముల్.

కం. శ్రీసూక్త పురుషసూక్త మ
హా సూక్తములన్ సుధాబ్ధి నంచిత లీలా
భాసురుఁడగు శ్రీ విభునకు
వాసిగ నభిషేచనమ్ము వలయుం జేయన్.

కం. కనకాక్షహరణుఁ గమ్మనఁ
గనకాన్వితపీఠి నునిచి కనకాంశుకముల్
కనవేడుక గాఁ బెనుజో
క నకుటిల ప్రీతి నొప్పఁగా నిడవలయున్.

ఉ. బంగరు కమ్మనిగ్గుల విభాసితమౌ దర మౌక్తిక ప్రభా
సంగతయజ్ఞసూత్ర మురుసార మృగీమద కుంకు మార్ద్రితో
త్తుంగ సుగంధి గంధకుల తోరము లై యరుణప్రభాస్థితిన్
రంగగు మేలియక్షతలు రాజితలీల నొసంగగాఁ దగున్.

చం. కలువలు చంపకమ్ములును గస్తురి పత్త్రిలు జాజిపూలు మ
ల్లలు విరజాజులొప్పు ముకుళమ్ములు పొన్నలు బొండుమల్లియల్
జలజములుఁ జివుళ్లు వరసౌరభ సంగతనవ్య పుష్పముల్
వలయు రమాధినాథ పదవారిజ పూజకు భక్తకోటికిన్.

శా. శాఖిన్ శ్రీహరిపూజ కొక్క తులసీపర్ణంబు సద్భక్తితో
సాలగ్రామముపై నొకండు దళమిచ్చున్ బూజ గావించు నా
శీలోన్నత్యుఁడు పాతకావళుల నిశ్చింతన్ విసర్జించి త
త్సాలోక్యంబున మించఁ గాంచు విభవాత్రాంతస్థితిన్ నిత్యుఁడై.

కం. తులసీదళాపచితికిన్
[దులయగునే !] యితరపూజ తోరపు భక్తిన్
గలిగిన సువర్ణపుష్పము
లలవడఁ బూజించుటొప్పు హరి చరణములన్.

తే. గోఘృతంబును సాంబ్రాణి గుగ్గిలమ్ము
నగరు కురువేరు మొదలు దశాంగములను
ధూపమొసఁగుచుఁ గర్పూర దీప మిడిన
నిరయబాధలు తొలఁగు వర్ణితనిరూఢి.

ఆ.వె. భక్ష్య భోజ్య లేహ్య పానీయ చోష్యమ్ము
లాది గాఁగ బహుపదార్థయుక్త
కనకపాత్రపంక్తి కమలాక్షునకు నివే
దనము సేయవలయు ధన్యమతిని.

కం. హస్త ప్రక్షాళనము ప్రశ
స్తగతిం జేసి సుదళ సత్క్రముకమ్ముల్
నిస్తుల చూర్ణమ్మున్ సౌ
మ్యస్తుతి పాత్రస్థవీడ్య మగు హరికొసఁగన్.

ఆ.వె. అగు త్రిలోక తిమిర హరణుఁడౌ హరికి నీ
రాజనమ్ము నర్చి రమణ వలయు
భాగవతుల కెల్ల భగవత్ప్రసాదమ్ము
తీర్థయుతము గాఁగ ధృతి నొసంగ.

సీ. మహితసౌరభపుష్పమంజరి, తుళసీ ద
దళంబుల మంత్రపుష్పంబొసంగి
న్యాయంబు దప్పక నరపతుల్ భూమిఁ బా
లింపంగ వలయును మేలిమిగఁ గాల

గతులు దప్పక వాన గల్గఁగా వలయు స
స్యములు పండఁగవలె నధిక శుభద
సౌఖ్యమ్ము లమర దేశమ్ము లుండఁగవలె
గో బ్రాహ్మణులకు నెక్కుడు శుభమ్ము

తే.గీ. ల మరవలెనంచు సాష్టాంగ మాచరించి
నృత్తముల్ సల్పి కీర్తించు నియతివలయు
నచ్యుతుని సన్నిధిని బాపహారణమునకు
నంతకంటెను క్రియలు లేవరసిచూడ.

చం. కల కొలఁదిన్ సుగంధి కనకప్రసవాంశుక నృత్తగీత ని
శ్చల బహుభక్ష్యభోజ్యముల సౌరభలేప బహూపచార సం
కలిత మహానురాగమునఁ గంజదళాక్షునిఁ గొల్చువారికిన్
దలఁగు విపద్దశల్ శుభము దార్కొను సౌఖ్యము లుల్లసిల్లఁగన్.

కం. స్రక్చందనాదు లతి నుతి
వాక్చాతురి మెఱయ భక్తవత్సలుఁడగు స
మ్యక్చరితున కర్పించిన
దిక్చయ పాలైక విభవ ధృతి గాంతు రిలన్ ॥

చం. అనుదిన మర్థి విష్ణుఁడని యంచిత భక్తి నమస్కరించి పూ
జనములొనర్చి చుట్టములు సాధులు బాంధవు లాశ్రితుల్ ముదం
బున వసియింప నచ్చట విభుత్వముమాని సమస్తవస్తువుల్
దనకును బంక్తికిన్ సమవిధంబున వర్ధన సేయుటొప్పగున్.

తే.గీ. పరఁగ నాత్మార్థ పాకియుఁ బంక్తిభేది
యను బృథక్పాకి బ్రహ్మఘ్నులనఁగఁ దగుట
నట్టి కృత్యము లెడసి శ్రీహరి నివేద
నాన్నము భుజింపఁదగు దామసాళి విడిచి.

కం. అన్నము లోపలి సారం
బెన్నఁగ నమృతమటఁ గలుషమేర్పడ సురయౌ
నన్నమునఁ గలియు సారం
బెన్నఁగ మలమండ్రు శ్రుతి విహిత వాక్యవిదుల్.

కం. మానియు మితాశనుండగు
మానవుఁ డపవర్గమొందు మ [తి] ద్వాత్రింశ
న్మాన కబళోదనుఁడు సుఖి
యౌ ను ద్రివారావగాహి యగుటు మున్గుఁ డగున్.

కం. ఆపోశన మాపాసన
మేపారఁగ నాసనమ్మునితరులిడఁ దగున్
శ్రీపతిమకు శోధిస్యబ
లా పదరజములను పోకలలి సిరులెడయున్ ॥

కం. ఉల్లియుఁ దిలపిష్టమ్మును
ముల్లంగి యలాబు హేయభూ జనితంబుల్
వెల్లగు బచ్చలి తామస
ముల్లి నివి త్యజింప వలయు నింగితబుద్ధిన్.

తే. పీఁటఁ గూర్చుండి పదములు పృథివి నునిచి
యైదు వ్రేళులఁ గబళమ్ము లనువు గాఁగ
యెడమ చెయి నేలనూనక కడ నునుపక
భోజనము చేయఁ దగవగు బుధులకెల్ల.

కం. పరిషేచన మారభ్యము
పారిఁ బ్రాదక్షిణము చిత్రభుక్తు లిడఁదగున్
మఱి యః పదక్షిణమ్మున
నెరయించుట లిష్టభుక్తినియతిఁ దలంపన్.

తే. చిత్రబలిఁ జూచుచు నెవరు భుజింతురేని
బరగు దోషమ్ము యమసూక్త పఠనములను
గాని లేఅదు చిత్రాన్నమూని యవల
మఱుఁగు సేయఁగఁ దగు ధరామరులకెల్ల.

కం. కబళ కబళమ్మునకు మఱి
ప్రబలఁగ గోవిందనామ పఠనము చేతన్
సొబగొందు మాస నిరశన
ప్రబల వ్రతఫలద మగుచుఁ బరగు బుధులకున్.

చం. మునుమును దియ్యగూర లతిమోదముతో గఱు శాకతిక్తముల్
గొనకొని వెన్క నామ్లములు కూర్మిఁ దుదన్ భుజియింప మేలగున్
జనువడఁ బాయసాన్నములు భక్ష్యము లొప్పగు నుప్పిబంబులున్
ఘనతఁ బవిత్రపాణి లలనామణి వడ్డన సేయ మానతన్.

కం. రాత్రిన్ దధియుక్తాన్నము
పాత్రము భోజనము నడుమఁ బానజలమ్ముల్
గాత్రమ్ము పుష్టి సేయున్
ధాత్రిన్ భుక్త్యంత పానతన్ బలమెడవున్.

కం. పన్నపుఁ బానము చేతను
నన్నము జీర్ణింపఁ బోవ దధికంబైనన్
దిన్నగు జాఠరానల
మెన్నిక పలుమాఱు ద్రావ హితవగు భుక్తిన్ .

కం. స లవణ జంబీర రసో
జ్జ్వల దేలా తక్ర మమరుఁ జతురత భుక్తిన్
జలిపిన వెనుక, నసాక్షిగ
వలనదు భుజియింప హేయవర్తనమగుటన్

సీ. తానైన సతియైనఁ దననుతు లైనను
సద్బంధు శిష్యులు సఖులు శ్రోత్రి
యులు నేయు పాకమ్ము వలనగు భుజియింప
రహి నెందుఁ బరపాకరతుఁడు, నెపుడు
నెచ్చట భుజియింప నిచ్ఛగించినవాఁడు
నిరయ దుఃఖమ్ములఁ బొరలు మిగుల
భోజనానంతరంబున నుదకము ద్రావ
నమరు తర్జని మధ్యమములనడుమ

తే. వలయు ధరఁబడవిడఁ గారవములసద్మ
తతుల వసియించు పితరుల దరికిఁ జేర
నవ్యగండూషముల క్షాళనంబు నైగ
మోక్తముగఁ జేసి వార్చి యథోచితముగ.

కం. కరములు గడుగక మున్నుగఁ
గర మమరఁగఁ బుక్కిలింపఁగాఁ దగు జలముల్
గరములు మున్నుగఁగడుగఁ బి
తరులకుఁ బుణ్యంపు హాని తప్పదదెందున్.

తే. నాలుగెనిమిది పన్నెండు నోలిఁ బదియు
నాఱుగండూషములు క్రమాచారముగను
మూత్రమల సర్జనమ్ముల భుక్తి పిదప
సురతకృత్యమ్ము పిమ్మట శుచుల కెపుడు.

కం. సారపురాణాగమ సువి
చారముచేఁ బ్రొద్దు జరగ సంధ్యావేళన్
ధీరమతి సంధ్యవార్చి జ
పాద్యధికో మెలఁగవలయు హరినుతి దనరన్.

కం. కర్మములన్నియుఁజేసియు
నిర్మలమతి విష్ణుభక్తినిరతుఁడు గామిన్
దుర్మతి దుశ్చర్యుఁడు నా
నర్మిలి లక్ష్మిపుఁ గొల్వనగురున్ శుభముల్.

శా. నిర్వాపంబున సత్పితృప్రతతి నెంతే యజ్ఞకర్మంబులన్
గీర్వాణావళి, సజ్జనాతిథుల భుక్తిన్ వేదపాఠంబునన్
సర్వాంచన్మునులన్ బ్రజాపతులఁ బ్రాజాపత్యరీతిన్ బలిన్
దుర్వారస్థితి భూతకోటి, జనసంతోషంబుగా మైత్రిచేన్.

కం. మొదమొదవ మెలఁగు విప్రుని
కొదవున్ సకలార్థసిద్ధి యురుతరసుకృతా
స్పద దివ్యలోక సౌఖ్యము
లదనందగు బ్రహ్మపదవి యంచిత వృత్తిన్.

సీ. అనఘు వానప్రస్థుఁడఖిల సంగమ్ములు
విడిచి శుశ్రూషకై వెలఁది వెంట
రా నగ్నిహోత్ర సంరక్షణమున కద్రి
వను లాశ్రమములుగాఁ దనర నచటఁ
గందమూల ఫలాదికము లగ్నిలో వేల్చి
తచ్ఛేష మగ్ని సంతర్పణమున,
కాత్మపోషణమున కనుకుస్థితిఁ జేసి
నిత్యకర్మాచార నిరతుఁడగుచు,

తే.గీ. బ్రహ్మచర్య వ్రతస్థితిఁ బరగి యజిన
వల్కలంబులు దాల్చి దేవతల పూజ
లేమఱక, భిక్షలిడుచు నెంతేని ద్వంద్వ
ములకు నోర్చి చరించుచు నలఘువృత్తి.

కం. అవసానకాల మొదవిన
నవిరళమగు వహ్ని నాత్మ నారోపణమున్
సవరించి బ్రహ్మనిష్ఠా
ప్రవణుండై యిష్టపదము ప్రాపింపఁ దగున్.

ఉ. అంతట భిక్షుఁడైన యెడ నాత్మ నిరీహుఁడు నిర్జితేంద్రియా
భ్యంతరవర్తనమ్ము ప్రణవార్థ జపాన్విత నిత్యకర్మముల్
సంతత విష్ణుదేవ పదసారస చింతనమున్ నిరింధనా
త్యంతిక పావకస్థితి మహోత్తమ గల్గిన ముక్తి చేకుఱున్.

కం. స్నానంబు చతుర్వర్గ ని
దానఫలప్రదము స్నానధర్మనిరతుఁడై
పూనిక భుజింపఁ డెవ్వం
డా నరుఁడు మలాశి యనఁగ నవనిం బరగున్.

కం. గాయత్రిఁబోలు మంత్రం
బేయెడలను లేదు మానసేప్సిత లోక
శ్రీ యనుభవమున్ మోక్షం
బాయతమగు విష్ణుపదమునై పొలుపమరున్.

ఆ.వె. బ్రహ్మయజ్ఞ మఖిలపాతక హరణంబు
నఖిలదేవతా ప్రియంబు వైశ్వ
దైవమబ్జనాభ ధన్య పదావాప్తి
యతిథిపూజ సుగతి కాకరంబు.

సీ. పల్లవ తృణ దారు పార్థివోపల కృతా
సనము లామయము నిర్ధనము నేయు
బలుపగు రత్నకంబళి సర్వకామ్యార్థ
సిద్ధిద మపవర్గ చింతనులకు
వ్యాఘ్రచర్మము పావనము కుశాసన
మంతక మైశ్వర్య మంగుళీముల
సంఖ్య కెక్కుడు పర్వసంఖ్య దానికి నెచ్చు
పుత్రజీవియుఁ దమ్మి పూసలొక్కటి

ఆ.వె. స్ఫటికరాజతోరు [స్వర్ణ] మయమ్ములు
ననఘరత్నమయము లంతకంటె
మోక్షదమ్ము దర్భ ముల్లు రుద్రాక్షలు
వేదమాత నెన్ను విప్ర తతికి.

కం. ఇట్టినియమములు మునుపటి
పుట్టువు సత్కర్మతతులు పుణ్యప్రదమై
నెట్టుకొని పరల నవనిన్
బుట్టిన భూసురుల కొదవు బుధనుతగతులున్.

కం. విను రాజుల కాయుధ జీ
వనమున్ శిష్టావనమ్ము హారక రిపు మ
ర్దన దుష్టనిగ్రహంబులు
జను భూసురరక్షణమ్ము సత్యగుణమ్మున్.

తే.గీ. యజన మధ్యయనమ్ము దానాభిరతియు
నర్హమగు యాజనమ్ము నధ్యాపనమ్ము
దానములు గొంట నృపతికిం దగవుగాదు
ప్రబలి తామస [రాజస?] భరితులగుట.

చ. రహి దళుకొత్తఁగాఁ బ్రజల రంజనసేయుట రాజనామతన్
వహి గను సర్వలోకహితవర్తనకై సృజియించె బ్రహ్మ దు
స్సహ ధరణీధరాద్యఖిత సంపద సాధు జనావన క్రియా
బహుతర శస్త్రజీవిక కృపాకరభూవర వంశ మిమ్మెయిన్.

సీ. సకలవర్ణాశ్రమాచార ధర్మక్రియా
నిర్ణీతిచాతుర్య నిపుణ మహిమ
దుర్మదోద్ధత ఘోర దుష్టశిక్షా శౌర్య
ధైర్యమహౌదార్య ధన్యగరిమ
నిఖిల దేశిక సుఖాన్విత విచక్షణ కళా
మంత్రి సామంతసామర్థ్య వహిత
ధరణీసుపర్వ నిత్య విధి ప్రపూర్ణ త
త్ఫల భాగ సంగ్రహ విలసితమతి.

తే.గీ. శక్ర యమ వరుణ ధనద సన్నుతాంశ
కలితబహుభోగదండన ఘనకృపా వి
శేష వితరణ గుణగణా శేష లోక
పాలనోత్సవపరులు భూప కులవరులు.

తే.గీ. అట్టి క్షత్రియవంశజు లఖిల భువన
రక్షణాధ్యక్ష సత్ఫలాపేక్ష ధరణి
సురులఁ బోషింప వారి తేజో విభూతి
క్షాత్రబలవర్ధనంబగు సారమహిమ.

కం. వారలకు నలిగి రేనియు
వారని తత్క్రోధవహ్ని వడిఁ గ్రాఁగుదు రా
నీరమునఁ బుట్టు ననలము
నీరమ్మున నణఁగు నట్టినియతి దలిర్పన్.

ఉ. పాలితలోకుఁడైన నరపాలశిఖామణి యాత్మరక్షకున్
జాలిన భృత్యవర్గముల సారె బహూకరణమ్మొనర్చి వి
ద్యాలలితాత్మ నీతియుతు ధర్మవిచక్షణు స్వామికార్య ని
ష్ఠా లసదప్రమత్తు సరసన్ సచివాగ్రణిఁ జేయఁగాదగున్.

ఉ. భూప్రజ భారమెంతయును బూనికతోడ వహించి వారితో
నప్రియముల్ ప్రియోక్తు లట నాడుట కొక్కని నేర్పరించి శ
త్రు ప్రశమప్రసంగముల ధూర్వహుఁడై సమ శత్రు మిత్ర శ
క్తి ప్రకృతి ప్రవీణమతిఁ గీర్తి వహించినఁ గాంచుసంపదల్.

ఉ. నమ్మిక పుట్టఁగాఁ గల జనంబులఁ బ్రోచిన గాపు విత్త మ
ట్లమ్ముగఁ గాంచి భూపతికి నూర్జితవైభవ మావహిల్లఁగా
సమ్మతిఁ జేయునెంతయు వశంవద సద్ధనధాన్యుఁడైనచో
నమ్మహిభర్త దేశముల నన్నిఁటు మేలనఁబోల్చు నెప్పుడున్.

కం. సత్యంబాయువు నొసఁగును
సత్యమె ధనధాన్యవృద్ధి సమకూర్చు జయా
న్నత్యమ్ము గల్గు దాననె
సత్యమె ధర్మమ్ము కీర్తి సద్వ్రత మెందున్.

సీ. పరశురాముఁడు భూమిపాలుర నందఱ
వధియించి యఖిల సర్వంసహయును
గశ్యపునకు దానకాంక్ష నిచ్చినయంత
నతఁడు విప్రుల కిచ్చె నవ్వనియెల్ల
భూసురు లది యేలఁ బొత్తు వోవక వైశ్య
శూద్రులు, తత్సతీస్తోమ ధనము
లపహరింపఁగ నంత నయ్యధర్మమునకు
నోర్వక నిలఁ గ్రుంగ నూరువులను

తే.గీ. నెత్తు కశ్యపుఁ గని ధాత్రి యెఱఁగి రాజు
నేర్పరింపఁగ వరము దా నెలమి వేడ
నజుని యనుమతి నతఁడట్లు యొలవరించె
క్షత్రకులమును ధాత్రిరక్షణమునకును.

కం. కావున భూసురుల న్ద్విజ
దైవములుగ దలఁచి వర్ణధర్మస్థిరతన్
గావింపవలయు రాజ్యము
పావనమగు దండనీతి పద్ధతి దనరన్.

ఉ. ఆవుల మేపి పాలు గొనునట్టి తెఱంగునఁ దోఁటఁ బెట్టి యా
పూవులు దాల్చు చందమునఁ బొల్తుకఁ గైసొనరించి క్రీడలన్
భావ మెలర్పనుండుగతి పట్టుగ భూప్రజఁ బ్రోచి వారిచేఁ
గావలె నన్న దెల్లఁ దగఁ గైకొని భూవిభుఁ డొప్పు నెప్పుడున్.

మ. చదువుల్ సాము పురాణగోష్ఠి ఘనభాస్వద్విప్ర సంరక్షణా
స్పద నానావ్రతదాన విష్ణుపదపూజా శాస్త్రవిజ్ఞానముల్
విదితాజ్ఞావిభవంబు న్యాయములు సద్విద్యా ప్రవీణత్వ, మ
భ్యుదయానేక విధాన కర్మచయ మొప్పున్ రాజధర్మమ్ములై.

కం. తపములు వ్రతములు యజ్ఞము
లపరిమితము చేయుకంటె నధికము ప్రజలన్
గృప న్యాయమ్మునమనుపుట
ఎపుడున్ ద్విజవరుల భక్తియెడలమి పతికిన్.

సీ. అర్థికోటికిఁ దగినట్టి కోరికలిచ్చి
పరిజనములకు సంబళములొసఁగి
మిత్రుల నెల్ల నెమ్మిగ ధనాఢ్యులఁ జేసి
శత్రుకార్య విచార సరణి తెలిసిఁగి
ప్రతికార్యమును నీతి మతి సంఘటింపుచుఁ
బ్రాంతవారలను శోభనత మనిచి
చారదృక్కుల దేశస్వాస్థ్యముల్ గని
సామంత మంత్రుల జాడ లరసి.

తే.గీ. ఘనత నేపట్లఁ దన్ను దాఁగాచికొనుచు
ధీర విశ్వాసకుల కధికారమిచ్చి
ద్రోహి కుటిలా వివేకుల దూరు నేసి
రాజ్యమేలెడి యాతఁడు రాజవరుఁడు.

కం. వర్తకులకు భూప్రజకున్
గీర్తికి [దగ?] కవులొసంగి క్షితిఁ బేదలఁ దా
వార్తకు నెక్కఁగఁ బ్రోచి సు
వర్తనుఁడగు రాజు భాగ్యవంతుం డెందున్.

కం. వికలాంగుల రక్షింపుచుఁ
బ్రకటితసాహసుల ఘనులఁ బావనకులులన్
సుకరుల సైన్యేశులఁగా
నకలంకత మనుచు నృపతి యతి ధన్యుఁడగున్.

గీ. చోరు లుబ్ధు నవిశ్వాసుఁ జేరనీక
రోగి వృద్ధుని దీను నారూఢి మనిచి
యాయమున నర్థధనమున కధికముగను
ధనము వెచ్చింపఁ జనదు భూధవున కెందు.

ఇది రాజధర్మంబింకను గ్రంథాంతరముల నెఱుంగఁబడు వైశ్యధర్మంబు వివరించెద.

సీ. కృషియు వాణిజ్య సుకృత ధేనుగుప్తముల్
సత్యవాక్యము విప్రజనపదాబ్జ
సేవయు దానమ్ము శ్రీహరి భక్తియు
శ్రుతియోపాసన శాంతి సకల
శాస్త్రార్థ విజ్ఞాన శమదమ సంగతి
బ్రాహ్మణాచారత పాపభాగ
మొనరఁ గర్మము చేయుటు చిత్తవర్తనమును
నత్యాశ లుడుగుట లమరు వైశ్య

ఆ.వె. కర్మములు దలంపఁగా హరి భజనమ్ము
విప్రభక్తి గల్గి వెలయ వలయు
శూద్రధర్మమునకు భద్రాత్మకమగు త్రి
వర్ణ సేవనంబు వశ్యకరము.

కం. ఆ చాతుర్వర్ణ్యాశ్రమి
తాచారము లాదవుకంటె నతిసులభంబుల్
బ్రాచుర్య శుభప్రదము మ
హాచతురతఁ దగు పతివ్రతాచార మిలన్.

సీ. పతిదైవ మనుచు సంతతము దత్సేవ నే
సిన నెల్ల దేవతల్ దనివి గాంతు
రచ్యుతుఁ డక్లైన హర్షించుఁ గావునఁ
బతి తుష్టి నేయుట సతికిఁ దగవు
భర్త లేవకమున్నె పరగ మేల్కాని గృహ
శుద్ధి గావించి భాసుర లలాట
తిలకమ్ము ధరియించి లలిత హరిద్రావి
లేపనయై నయలీల విభుఁడు.

తే. గీ. పనుపు టది వేగ నొనరించి పనులయెడల
నలయికలు మాని వేసట నంద కయుల
శాంతసంబునఁ జేయుచు స్నానదేవ
పూజనాదికములను నేర్పున ఘటించి.

తే. గీ. పొట్టు సమ్మార్జనియుఁ బ్రోయి బూది కట్టి
యెటులను గనుపడనీక మూలలకు నొదిగి
చూడ్కి కింపుగ గృహము భాసురమొనర్చి
శుచి రుచులుగల్గఁజాక [మచ్చ?] గనొనర్చి.

చ. తనపతి కెద్ది యెూ ప్రియము తానది పూనికఁ జేసి భక్తియున్
వినయము దాల్చి భర్త కనువీడఁగఁ బల్కునఁ జిన్నవోక, మా
ఱనక ప్రియమ్ము లిన్మడిగ నంచితశీలమున న్నెలంగు న
వ్వనితగదా! సమస్తజనవంద్యచరిత్ర పవిత్ర యిమ్మహిన్.

మ. పతి రెువ్వారలఁ బ్రోచువారు తనకున్ బంధువ్రజం బేరి పై
నతికోపంబొనరించువార లహితుల్ హర్షింప హర్షమ్ము దుః
ఖితుఁడైనం గడుదుఃఖి, నవ్వనెడలన్ గేళీగతుల్, విన్నయై
న తఱిన్ విన్నదనంబునొందు సతివో! నారీలలామం బిలన్.

ఉ. దాసివిధంబులం బనులఁ, దల్లి విధంబునఁ బోషణంబులన్
భాసురబుద్ధి మంత్రిగతి, బాంధవురీతి విపద్దశన్, మహో
ల్లాస సుఖప్రసంగరతులన్ వర వారవధూటి కైవడిన్
వాస గనట్టి కాంత గుణవర్ణిత సాధ్వి దలంచి చూడఁగన్.

కం. పతిపలుకులు జవదాఁటక
వ్రతదానము లవనియాజ్ఞవహిఁ జేయుచు స
న్మతివాక్యాయిక కర్మ
వ్రతతులఁ బతిమీఁదభక్తి పట్టుగ నెలమిన్.

ఉ. తల్లియుఁ దండ్రి బాంధవుఁడు దైవము నెచ్చెలియాప్తుఁడున్ ఘనో
వల్లభుఁ డార్యుఁడున్ సుకృతవైభవ మాత్మవిభుండె యన్యు లౌ
నెల్లరు నాత్మభర్తగతి నిష్టులుగారని నిశ్చలాత్మయౌ
పల్లవపాణియే ద్విజకులపావని శ్రీవనితాంశజాతయున్.

వ. విభుఁడు వివేకియైనఁ గడుపీఁటిఁడయ్యును ధనాఢ్యుఁడైన దు
ష్ప్రభుత దరిద్రుఁడైన మతిబంధురుఁడైన, నబుద్ధియైన, స
చ్ఛుభరుచిరాంగుఁడైన గత సుందరుఁడైనను దైవభావనన్
బ్రభు నతిభక్తి సేయఁదగు భామకు భర్తయె దైవ మెన్నఁగన్.

శా. గంగాస్నానము సేతు సేవయును లోకత్రాణదానవ్రతో
త్తుంగప్రక్రియ లాచరించు తెఱయింతుల్ సాధ్వితో సాటియే!
సాంగత్యాధిక భక్తి సుస్థిర హృదబ్జాత క్రియాధారయౌ
శృంగారాకర భర్తృసేవ వలనన్ జెల్వొందు నెంతేనియున్.

కం. పతిపూజ సకల దేవ
ప్రతతిం బూజించునట్టి ఫలము లొసంగున్
బతి కెదురాడిన దానికి
గతికలదే! నిరయలోకగతి దక్కంగన్.

కం. చెదరని భక్తిన్ మదిఁ గడు
ముదమున ధర్మార్థకామ ముఖ్యార్థమ్ముల్
పొదలంగఁ బతిసేవయె తగు
సుదతికి పతియొండుగతుల శుభములు గలవే!

చం. పురుషుఁడు విప్రమేల్క్వనుమఁ బుణ్యసులక్షణహీనఁ జూచినన్
దొరకొను కీడు తల్లి సయిదోడులు దక్కఁగ భర్తృహీనయౌ
తరుణి కృతావగాహయయి తత్పరతన్ ధళు సూర్య భావుఁగా
గుఱిచి నమస్కృతార్ఘ్యములు కోరికనిచ్చుచు నేకభుక్తయై.

కం. సుతులయను మతిన్ దాన
వ్రతములు గావించుకొనుచు వహి సన్న్యాస
స్థితి యొనడవడికిం దగు
పతి విధవయు సుకృతశీల మహిమన్ జెలఁగున్.

చం. తనయులులేని యంగన ముదమ్మున భర్తకుఁ బ్రీతిగాఁగ న
వ్వనజదళాక్షుఁ బూజ లనువారము భూసురతర్పణమ్ము శో
భన ఘనదానధర్మములు పావనసద్వ్రతచర్య నొందినం
దనవిభుఁ గూడి స్వర్గసుఖధన్యత నుండి చరించు నెంచఁగన్.

కం. ప్రౌఢిమ సద్వ్రతనిరతా
రూఢిన్ సార్ధత్రికోటి రోమపరిమితో
ద్గాఢాబ్దంబులు సురపురి
నోఢాంచద్వైభవముల నుండున్ దిరమై.

కం. కలికాలమ్మున స్త్రీ శూ
ద్రులు సాధువులనుచు మునులతో వ్యాసుఁడు మున్
దెలిపెఁగదా! సురతటినీ
జలమధ్యస్థితిని సుకృత చరితాస్పదుఁడై.

చం. వినుఁడు ప్రమాదమైనయెడ విప్రులు మున్నుగ నెల్లవారలున్
దనరు నిజోచితక్రియలు దప్పినచో నిశి జాములోపలన్
మునుకొని యన్నియున్ సలుప ముఖ్యమగున్ నిగమోక్తి, నట్లు గా
వునఁ గులధర్మచర్యనలఘున్ మతి యొప్పఁగ సేయఁగాఁదగున్.

తే. గీ. వేదవేదాంగశాస్త్రముల్ వెలయ దీపి
తాంగములుగాఁగ వెలుఁగొందు నబ్జనాభుఁ
డతని యాజ్ఞోక్తు లఖిలేతిహాస పరణి
గాన జనుల కవశ్యమ్ము కర్మనిరతి.

చం. తను కులధర్మముల్ నెరపఁ దాలిమి మేలిమి లేకయున్నచోఁ
గమలదళాక్షు లోకవిభుఁ గారణకార్యనియామకున్ రమా
రమణుఁ బరేశు నాద్యు మునిరంజనుఁ గీర్తన పూజలన్ జరి
క్రమహిత సన్మతిం గొలువ ధన్యత నొందుదు రెందు నేనియున్.

చం. హరిశిలయంబు దారువుల నందపు టిట్టికతాలనైనఁ దా
విరచిత మొప్పఁజేసి శుభవిశ్రుతుఁడై భజియించు మర్త్యుఁ డా
పరమున విష్ణురూపమునఁ బాటిలు నీ యిహమందు సౌఖ్య భా
సురవర కీర్తులం బొదలి శోభనవైఖరి మీఱు నెంతయున్.

కం. కేశవగృహ మార్జనమునఁ
గ్లేశమ్ముల నెల్లనడచి కృతకృత్యుండై
యాశా విహీనశుభలో
కాశాగతి చరితుఁ డగుచు నతి ముద మొందున్ ॥

గీ. నిత్య కర్మమ్ములా శ్రమనిరతి వర్ణ
ధర్మ మేమరకున్నట్టి ధర్మరతులు
శరణుఁ జొచ్చిన వార్తల కరుణ మనుచు
ఘనులు నల భూతహితులు స్వర్గమున నుండ్రు

కం. విధివత్క్రమమున మెలఁగుచుఁ
గథితనిషేధములు మాని కడు సత్యవచః
ప్రథితులగు పుణ్యులుందురు
సుధాశనులు పొగడ వినుము శోభనలీలన్.

మ. వ్రతులన్ బ్రోచుచు శౌచయుక్తులుగ సద్వాత్సల్యుఁడై బ్రహ్మసం
గతునిన్ శ్రీవిభు నెంచి తన్మయము గాఁగా సర్వమున్ గాంచు సం
తతమానాఢ్యుఁడు యజ్వియున్ దివిష దుద్యల్లోక సౌఖ్యంబులన్
తృతి సత్యాధిక లోకభోగములు నెంతే గాంచు నత్యున్నతిన్.

సీ. సప్తసంతాన భాస్వచ్చారు చరితులు
కదన హంవీరులై యదరుగుండె
వీఱికి కండయు లేక యరులచే నీల్గిన
ఘనులు సమ్యగ్జ్ఞాన కలన నమరు
వితరణ గుణులు సద్వినుత సత్యవ్రతా
చారులు నియమ ప్రచార హితులు
నుచిత వర్తనులు సర్వోపకారులు ఘన
స్వర్గాది లోకసంచారులగుదు

తే. గీ. రఖిల పుణ్యనదీ భూధరా శ్రమములు
గాంచువారలు సత్యలోకమున నుంద్రు
పుణ్యకాలమ్ము గడవని భూరి సుకృతు
లబ్జభవు నొద్ద నుందు రత్యధికలీల.

కం. ఉప రాగవిషువు లయనము
లుపవాస వ్రతదినమ్ములొగి పర్వములన్
విపుల తర పుణ్యకాలము
లపరిమిత ఫలప్రదమ్ములవగాహమునన్.

సీ. గ్రహణకాలమ్మున గంగగోదావరిఁ
గృష్ణఁ గావేరిఁ గ్రుంకినుట లెచ్చు
జాహ్నవీ సహ్యజా సంగాంబుధుల జగ
న్నాథ సేతువుల స్నానఫల మధిక
మగుకోటి ధేనువు లన్ని కన్యాదాన
ములు సేయు సుకృతమ్ము గలుగు కతన
స్వామి పుష్కరిణిని శశి పుష్కరిణియందు
నిత్య పుష్కరణిని నైరయు శుభము.

ఆ. వె. మఱియు జలధిఁ గలయు మహనీయ నదుల యం
దందొకింత తక్కువగు ఫలమ్ము
దేవఖాతసమితిఁ దెలియనట్లగు నర
ఖాతసరసు లల్పగత ఫలములు.

కం. కూపోదకములఁ గ్రుంకుట
పాపం బుపరాగవేళఁ బరగనశక్తి
వ్యాపారు [లు] తటి నీహ్రద
నా [పీ] తీర్థోదకముల వరెఁ గ్రుంకిడఁగన్.

చం. ఘనతరపుణ్య తీర్థములఁ గాఁగుల [దెచ్చిక] స్నాన కర్మముల్
తన కల కొద్ది దానములు దాలిమి మేలిమి సేయఁగాఁ దగున్
వినఁడట నంతకోపమిని వెచ్చని నీళ్లని యేని స్నానమున్
దనరఁగ సేయ కున్కి యగు ధర్మ విరోధము సాధునిందయున్.

తే. గీ. విష్వాయన సంక్రమంబుల వెస నుగాది
లందుఁ బర్వంబులను గ్రుంక నట్టివాఁడు
బ్రహ్మరక్షస్స్వభావమ్ము పరగ మెలఁగు
పతితము జన్మదకంబైనఁ బాపముదవు.

కం. తోయములెల్లన్ గంగా
తోయము దానములు భూమితులలకు నెనయౌ
నాకొండ విప్రులు బ్రహ్మస
మాయతులౌ గ్రహణకాలమగునెడఁ దలపన్.

సీ. అందు శాఖాత్రయ మనువుగఁ జదివి గ
ర్భాధాన మాది యౌనట్టి వేద
సంస్కారములు గల్గు సద్గుణుఁడతఁడు బ్రా
హ్మణుఁ డాత్మశాఖి తదంగ పంక్తి
సంస్కారయుక్తుఁడై చదివిన యతఁడు వి
ప్రుండదేమియు లేక పూర్ణ సకల
సంస్కారములు గల్గి సత్కర్మరుండైన
యతఁడు ద్విజుండగు నదియు మాని

తే. గీ. కాలము తెఱింగి గాయత్రి మేలి మెసఁగ
జపము సేయుచు నాచార నిపుణుఁడైన
యతఁడు ధారకుఁ డట్టి గాయత్రి యొప్పు
డోపలుకు వాఁడు జాతి మాత్రోపజీవి.

కం. అదిగాక విప్రులెన్నఁగఁ
బదివిధములఁ బరగు చంద్రుడు బంధుర కర్మా
స్పదమగు రీతుల గుణముల
విదితముగాఁ దద్విధమ్ము వివరింతుఁ దగన్.

సీ. సౌమ్యుఁడై సాత్త్విక సద్గుణుఁడై కర్మ
పరభోగి యతఁడు దేవద్విజుండు
తను పలమటు కోర్చి తనధర్మములు చేయు
పుణ్యుఁడు సంయమ భూసురుండు

సంతానకాముఁడై సత్కర్మనిరతుఁడై
ప్రజల నాతఁడు విప్రవాడుండు
నాయుధజీవియై యాచార్య పరుఁడు స
త్కర్మియైనతఁడు క్షత్రద్విజుండు

తే. గీ. వర్తకత నుండునాతఁడు వైశ్యవిప్రుఁ
డరయఁ గృషిసేయు శూద్రధరామరుండు
పలువగల వాఁడు సంకర బ్రాహ్మణుండు
తిరుగు నెపుడు పిశాచధాత్రీసురుండు.

ఉ. మానవచిత్తముల్ గలఁగ మాటికిఁ బల్కుచుఁ గర్మశూన్యుఁడై
దానౌరులన్ హసించుచుఁ దబ్బఱలాడుచు నీర్ష్యచే నసూ
యానుభవమ్ము హింసల నయంబిల మానని వాఁడు ధారుణిన్
దానవవిప్రుఁ డెంచ మదిఁ దాలిమి మేలి మెఱుంగఁ డెయ్యెడన్.

కం. బరువులె మోయుచు గడుదు
ష్కర కర్మము దవిలి సర్వకంటకవృత్తిన్
బరుషపు మాటలె నిజముగఁ
బరగిన యతఁడవని గార్దభద్విజుఁడెలమిన్ ॥

ఆ. వె. కులము విడిచి యన్యకులముఁ గలసిన
యతఁడు పతితుఁడగు మహాఘమాక్తి
మఱియు నట్టిజాతి మరగి మెలఁగిన
వాఁడు నట్టిజాతి వాఁడు దలప॥

కం. సందెల భోజననిద్రలు
నుండెఱవలనొందు వేదనుతి పాతముగా
దెందున్ వృత్తారోహత
యుండదటి నిందాఁటికరము లూఁదుటఘమ్ముల్॥

సీ. ఒరునింటఁగాఁపుర ముండుట కొఱగాదు
పుత్రదారలతోడి పోరుగాదు
ద్విజభృత్య బాంధవ ప్రజ వివాదముగాదు
పతితులతోఁ బ్రతిభాషచనదు
గోమహిషిక్రయకుటిల వర్తనగాదు

— — — —

దేవతా సన్నిధి దీర్ఘయాత్రలఁ బుణ్య
తీర్థస్థలాదులఁదె అవగసయుఁ

తే. గీ. జనదు వీడ్యము సచకవస్త్రములు సన్న
మంగమొత్తుట తలయంటుటంఘ్రిపీడ
నంబు శూద్రులచేగాదు నయవిదులకు
గూపజలపాన శౌచముల్ గూడవరయ ॥

ఆ.వె. మూర్ఖుతో వివాదమును గులటా గోష్ఠి
స్థండిలమున భుక్తి శయన దేవ
పూజనములు జపము పూని ధ్యానమురతి
సలుపఁజనదు నెట్టి జనులకైన ॥

కం. అందున వేదము శాస్త్రము
పొందెఱుఁగుమఁ గర్మయుక్తి భువనేశు హరిన్
జెంది భజించు మహాత్ముల
కెందున్ దానంబొసంగ నెసఁగున్ శుభముల్ ॥

తే. గీ. గ్రామ నక్షత్రయాచకుల్ కడగు దేవ
లుండు సామాన్య విప్రులు జండగోపి
గాయకుండు సదాగతి ఖలులు పంక్తి
కర్హమగు వారు గారు శాస్త్రాను రూఢి ॥

తే. గీ. శ్రాద్ధముల నిట్టి వారల సంగమమర
దరయ శ్రద్ధ నొనర్పఁగానగుటఁ జేసి
శ్రాద్ధమగు గానసర్వ ప్రచార విధులఁ
బ్రతి శరత్తునఁ జేయుమి పాపమగును ॥

కం. ఒక నెలకలదనఁగానే
ప్రకటిత వస్తువులు గూర్చి షడతుల పొందున్
రకముడిగి బ్రహ్మ విద్యా
ప్రకర వ్రతనియతి మెఱయ భావ్యంబరయన్ ॥

కం. పైతృకము లిట్లు సేయఁగ
రీతియగున్ గర్త శాస్త్రవృత్తి సుగుణరూ
పాతిశయ యోగ్యముల శుభ
చాతుర్యుఁడుఁ వలయు భోక్త సమ్యక్చర్యన్ ॥

ఆ. వె. పూర్వవయసు, తండ్రి, పాసఁగు నధ్యయనమ్ము,
సమశుభాంగగరిమ సారనిగమ
కథితనియమవిధము గలవాఁడు భోక్తయౌ
భాగ్యయుక్తి శ్రాద్ధయోగ్యుఁడగుచు ॥

సీ. అమర నమావాస్యలటు సంక్రమణములు
మన్వాదివైధృతుల్ మహాయుగాదు
లావ్యతీపాతలు సమ్మహాళయ పక్ష
ఘనగజచ్ఛాయాష్టకమ్ము కూడ
షణ్ణవతిశ్రాద్ధ సంజ్ఞచే నిత్యముల్
నైమిత్తికమ్ము లామ్నాయనియతి
గ్రహణాయనములఁ దీర్థంబుల విషువుల
మృతదివములఁ బెట్టుటెసఁగు నిష్ఠ

తే. గీ. నవిహి సంపద గల్గుచోనైన విస్త
రమ్ము సేయక నియమపూర్వముగ భోక్త
నాగ్నికుఁబవిత్రు నార్యుగా నరయవలయు
నితర కృత్యుల రోగుల నిడఁగఁజనదు ||

సీ. గణుతింప నగ్నౌకరణ పార్వణములు సే
యమిఁ గర్తనిరయచయంబునందుఁ
దగ నిమంత్రితుఁడొండువగ భుక్తిఁగొనినఁద
త్పితరుల వొందు దుర్గతులు పెక్కు
పరదినస్నానతర్పణ హీనతన్ కర్త
బిత్రుతతితో నసద్గతి వసించు
గాయకున్ కృతఘ్నగర్భకు వ్యాధిస్థుఁ
బతితు స్తబ్ధుని మూర్ఖుఁ బాపకర్మి

ఆ. వె. వేదరహితు వైద్యు విక్రయ క్రయరతు
జాడ్యమూఁగ బంధుజన విరోధు
నశుచి శస్త్రజీవి నంగవైకల్యు దు
ర్గ్రామణి ననధీతుఁగాదు వొందుప.

ఉ. వేదపురాణ శాస్త్రజపవేది లసచ్ఛుచి శ్రోత్రియుండుమ
ర్యాది జితేంద్రియుండనఘుఁడగ్నికుఁడధ్వరి యాత్మతత్త్వసం
వేది విరాగి కర్మఠుడు విశ్రుత సద్గుణి జీవపైతృకుం
డాదట శ్రద్ధ కర్మమున నర్హుడు భుక్తికిఁ గొనంగ నమ్మెయిన్ ||

ఆ. వె. కర్త పాపయుతులఁగని పల్కఁగారాదు
నలినముఖులతోడ నవ్వరాదు
కుటిలు మాని భైక్షుకున్ బ్రహ్మచారి స
పంక్తినిడి భుజింపఁబాడిగాదు ||

చ. కపుసడి భోక్తనిందితపుఁగైవడి వానిని గాక మేలిమా
పడువగు నట్టివానిగ నవశ్యముగా నియమించి కర్తయున్
గుడుకొకయింత లేక పరితోషిత హృద్గతి నాఁటితోద్దినం
బెడపని నిష్ఠ భక్తిదగు నేకమనస్స్థితి నేకవారముల్ ॥

తే. గీ. క్షౌరమభ్యంగ తాంబూల చర్వణములు
దంతధావన ముడిగి శ్రాద్ధ దినమునను
గర్తయుండుట తగవు భోక్తలకు వలయు
నన్నియుం దద్దినమ్మున కెన్ని చూడ ॥

కం. తెరువునడత పనిపాటలు
తరుణీ సంగమము మఱియుఁదగు భోజనముల్
పరివర్జితమ్ములగు నిరుఁ
దెఱఁగుల వారలకు నేయఁ దగు పుణ్యమ్ముల్ ॥

కం. మఱలఁగుడువ వాయసమగు
సౌరిదిన్ సురతమున గ్రామసూకరమగు న
త్తెఱఁగుల పనులన్ గృధ్రము
కరణిన్ జనియించు భోక్తకర్తయు జగతిన్ ॥

సీ. బహుబీజయుతశాక పంక్తులు గోఁగు కాదు
క్షుద్రధాన్యమ్ముల చొప్పుగాదు
వసుధ నెంచగను నింద్య వస్తువుల్ కూడవు
పూర్వ సంచితములు పాసఁగవు తగ
నాసనసంపాద్య మౌ మహనీయ వస్తువుల్
శాకముల్ నిశ్శబ్ద సగణిఁదిరుగ
పోఁతలు గావించి పారిఁబోరి బేల్చక
ద్రవయుతమ్ముగఁజేసి రవణమొసఁగ

తే. గీ. నరఁటి పూవు దక్క నవినాలుగున్ గంద
మూల ఫల మధువులు శాలితండు
లములు చామ లడవి నమరిన శాకముల్
గలుగఁజేయ యోగ్యగతిఁదనర్చు.

కం. అడుగకమున్నె పదార్థము
లిడగా మౌనమున మంత్ర మేమియుఁ దాపై
నొడువక తదుత్తరమ్ములు
తొడిఁగిల్కుచు భోక్త నియతితోఁ గుడువఁదగున్ ॥

కం. స్థానముననుండు విప్రుఁడు
పౌరాణిక మంత్రములు వొడువఁ జొల్పరి శ్రాద్ధం
బానముగాన వేడొక
మానఘనుఁడు వలయు శ్రాద్ధ మంత్ర పఠనకున్ ॥

కం. అన్నము పరమాన్నము మృదు
సన్నుత భక్ష్యములు శాకసమితియుఁ గ్రమమొ
ప్పన్నిడఁగాఁదగుసం
పన్నముగా లవణతక్రపరివర్జముగన్ ॥

ఆ. వె. భక్ష్య భక్త సూపపరమాన్నముల మీఁద
నాజ్య పాత్రమును చుటిది యవర్త
మిడిన ఘృతము సుగకు నైన తదన్నము మాంస
సమముటంచుననిరి శాస్త్రవిధులు ॥

కం. తనరెడి యగ్నౌకరణము
మునుకొని పిండప్రదానమున్ బ్రాహ్మణభో
జనమున్ గర్మత్రయ మనఁ
జను నిష్టులువలయు భక్తిసలుపఁగఁబిదపన్ ॥

వ. ఇట్లాగమోక్తంబుగా నొనర్చినఁబితృతృప్తియగు మఱియును.

సీ. ధర్మంబునన్ శశధరుడాత్మ కళలెల్ల
నుడుగ నోషధుల యందుంచు గాన
నా దినమ్మునఁగోయుటదిగాదు శాకప
ర్ణమ్ములు మఱిపదార్థమ్ములెవ్వి
యావులఁబిండుట లవని దున్నుట దధి
ద్రచ్చుట కొఱగాదు తద్దినమునఁ
గపిలలఁదగు హవ్య కవ్యంబులకుఁబిదు
కంగ సంకరుల నంటంగఁజనదు

తే. గీ. తెలిరజకులఁగనుగొనఁ జాల బాళ
మిట్లు నడువక తప్పినయేని సకల
పితృగణ విభూతియన నఘవితతి నొంది
నిరయమున నుండు నిజ వంశకరులఁగూడి ॥

ఆ. వె. బహుళ పక్షయుక్తి పాడ్యమి మొదలుగఁ
జంద్రకళలు గొంద్రుసరవి నిచ్చి
నట్టివరుసనువల నడుగు నమావాస్య
నిందుఁడదియె కుహువనం దనరును

కం. శశిగ నొకకళ గ్గసి
సినీవాలీనామదర్శ నిరతిం దగు నా
యావేళ నోషధీస్పృశ
భావింపగ పాతకంబు ప్రబలం బెలుచన్

సీ. వహ్నిసూర్యేందు విశ్వవరుణ దేవ వ
షట్కార నిర్జరస్వాములఖిల
దేవర్షులుం జుండును శశితోయమ వాయు
పార్వతుల్ పితరులు పరఁగ ధనద
పశుపతులును బ్రజాపతులును గృష్ణ ప
క్షంబున గ్రహియించి కడఁగి శుక్ల
పక్షమ్మునందిత్తురా శుపాకరునకుఁ
గళలొక్కటొక్కటిగాఁగ వరుస

తే. గీ. నొక్కకళచేతఁ జంద్రుఁడు చిక్కి సూర్యుఁ
గలయు నమవస నిట్టిది కారణముగ
నా యమావాస్య నోషధులంటుఁజనదు
దడవ నేరికిఁ బాపముల్ దప్పులుకతన ॥

ఉ. సంతతివర్ధిలున్ మిగుల సంపద లెచ్చగు బ్రహ్మతేజ మెం
తెంతయు మీరు రోగచయ మేఁపణఁగున్ మతిగల్గు నిత్యమున్
సంతస మొందుగాన సరసమ్మున శ్రాద్ధమొనర్ప ధర్మ మ
త్యంత వివేకమున్వలయు నట్టిక్రియన్ ధరణీసురాళికిన్ ॥

కం. చాతుర్వర్ణ్యులకిట్టి ద
రీతియగున్ సేయరేని ఋణసంగతులై
పాతకములనుభవింతురుఁ
గాతరరోగాదిబాధకతలాదవ నిలన్

కం. సుజనస్తుతినేతత్క
ర్మజ ఫలమచ్యుతునికొసఁగు రహిఁదగు పిత్రూ
పి జనార్దనుఁడప్రతివా
గ్వ్రజవైఖరి నెచ్చుతక్కువలు సగుణముగన్.

తే. తవిలి శ్రాద్ధము ల్విడమి బేతాళుఁడగును
రోగపీడలునొందు నిర్యాధిసంత
తియును వర్ధిల్లు నెంతయుఁ దెలిసి చూడ
నది గృహస్థాశ్రమకర్మ మధికనియతి ॥

వ. అదియు జనార్దన ప్రీతికరంబగుటఁ దద్రూపంబులగు సాలగ్రామ సన్నిధానంబు సత్యోత్తమంబగు ననుడు సాలగ్రామ మూర్తిభేద పూజా ప్రభావ జన్మస్థానంబులు వివరింపవే యనిన శౌనకాదులకు సూతుండిట్లనియె—

చం. హరిపద పూజకై యొదవు నట్టుగఁ బూవులతోఁటలన్ బరా
త్పర హృదయాను మోదమును, భానురమా తులసీవనక్రియన్
నిరతము స్వర్గసత్యసుఖనిశ్చలభోగములొంది పిమ్మటన్
మురహర సన్నిధానమున ముక్తులునై వసియింతురా ఘనుల్.

మ. సరసీజాక్షుని యొద్దఁ గీర్తనము భాస్వల్లీలఁ గావించి త
ద్వరవాదిత్ర విశేష నాట్య కలనా వైయాత్య సద్భోగ వి
స్ఫురణ ప్రక్రియఁ జేసినట్టి నరు లిచ్ఛాసౌఖ్యముల్ జెంది త
త్పరభోగమ్ములు గాంతురా హరికృపా పారీణభావమ్మునన్ ॥

మత్తకోకిల॥ ఇందిరా విభుమందిరమ్ముల నింపుతో జలసిక్తతన్
సౌందరాధికరంగవల్లులు సాధునందిత సత్క్రియన్
వందనైక పరిక్రమంబుల వాసుదేవు భజించినన్
జెందు నైహిక వాంఛలన్ దుదిఁ జేరునాతఁడు శ్రీవిభున్ ॥

ఆ. వె. పంకజాక్షునకు పట్టునఁ గొలఁకులు
నుపవనమ్ము లెవ్వరొప్పఁ జేతు
రట్టి పుణ్యులధికు లఖిలలోకమ్ముల
వారి మహిమ లఖిల వైభవములు ॥

చం. గొడుగులు చామరంబులును గొప్పగు తీర్థపు హేమపాత్రముల్
పడగలు నాలవట్టములు పళ్లెరముల్ వరదర్పణంబులున్
సడలని భక్తి శ్రీహరికి శాశ్వతలీల సమర్పణమ్ము సె
ప్పుడు తగఁ జేయు పావనుల పుణ్యము లెల్ల గణింపశక్యమే ॥

తే. గీ. వారిజాక్షుఁ డనంతావతారములను
పాలనోజ్జ్వల విభవమ్ము ప్రబలఁ దాల్చె
నవి శిలాకృతి గండకి నమరె ననుడు
వరమునీంద్రులు తత్ప్రభావములు వేడ ॥

కం. అనఘుఁడు సూతుఁడుదయని
ట్లను గండకీయనెడు కాంత యందితనిష్ఠన్
మునుదపము నేసె హరిహర
వనజజులాత్మజులుగాఁగ వాంఛఁదలిర్పన్.

చం. తపమొనరించినంత మురదానవహారి విధాతృశంకరుల్
కృపఁగనుకొత్త వచ్చటియుఁ గేవల భక్తి నమస్కరించి మీ
రపరిమితానురాగ భరితాత్మకులయ్యు మదీయగర్భమం
దిపుడు జనింపఁగా వలయు నేర్పడనంచు నుతించునింతికిన్.

కం. త్రిగుణాత్మకులిట్లనిరో
మగువా! ధుని మువగునీవు మహి నీయందున్
మువురము బుట్టెద మనుడా
సుగుణాకర గండకీ విశుద్ధాహ్వయయై ॥

కం. మేరు గిరిదక్షిణమ్మున
సారహరిక్షేత్రభూమిఁ జక్రనదీ తీ
ర్థారూఢిన్ బ్రవహించె సు
ధీరంజన శుభఫలప్రదీపితయగుచున్.

తే. గీ. బ్రహ్మనిర్మిత చక్ర సరస్తటోత్త
రమున బహుపుణ్య తీర్థ విరాజితముగ
గరిమ మిరయు మహాశృంగ గిరివరంబు
రాజితంబగు పంద్రెండ్రు యోజనముల ॥

ఉ. ఆగిరినీడలన్నది మహాంబువులన్ బ్రసరించు ఠావులన్
బాగగు చక్రచిహ్నములు భాసురమౌ శిలలున్ ద్రుమంబులున్
నాగ పతంగ కీట మదనాగ మృగావళి తన్నగాగ్రరే
ఖాగత భూమినిల్చి లసదాకృతు లౌవర చక్రసంగతిన్.

ఉ. అచ్చట నాదిమూర్తులు నిజార్చక మోక్ష ఫలప్రదాతలై
యచ్చుగ నాత్మ చిహ్నముల నర్మిలితోడ శిలానురూపతన్
హెచ్చుగఁ బుట్టిరార్య వినుతేప్సితలీల ననేకరూపముల్
మెచ్చుగఁదాల్చి మాధవు నమేయశుభాకృతు లెక్కువైతగన్.

సీ. తచ్ఛిలా భేదముల్ ద్వారమానంబులు
గ్రాహ్యమ గ్రాహ్య ప్రకారములును
క్షేత్ర లక్షణములు చిత్రచక్రస్ఫూర్తి
గుణుతులు వివరింతు సరసిజభవుఁ

డలరి నారదముని యడిగినఁ దెలిపెదంగ
బల్కిన విధ మెల్లఁ బ్రౌఢిమమున
స్థలజముల్ జలజముల్ సరవి సాలగ్రామ
నామకా శిలలటు నయముతోడ

తే. గీ. కొండ పండనె యూరడి మెఱుంపలవు
గండకిన్ గూడు చో శిలాకారములగు
నమరు నంవాస వజ్రకీటములొకటియ
యున్నచోఁ జక్రయుగ్మమ్ము చెన్నుమీఱు.

కం. రెండున్న నాల్గు చక్రము
లుండున్ మఱి యరువదేండ్ల కొగిసూక్ష్మములై
చండాతి తీక్ష్ణముఖముల
నిండిన బహువర్ణ [భేద] నిరతిన్ శిలలన్ ॥

కం. శిలవెలుపల నంటినచోఁ
బొలుపుగ నొక్కొక్క చక్రమున్ బుట్టున్ లో
పలనంటు నొకటి రెండుగ
నలవడు చక్రములుచేయు నంచితరీతిన్ ॥

సీ. బాలచక్రము పుణ్యఫలమిచ్చు యౌవన
మెలమి శుభాశుభ ఫలములొసఁగు
వృద్ధచక్రము పుణ్యవిధమల్ప మతివృద్ధ
మది శుభాశుభమిశ్ర మగుచునుండు
తద్వర్ణ గరెను రక్తంబైన రాజగు
మఘపింగళమ్ముల మలయుభోగ
మోక్షఫలములు వళతమా నెడ ముక్తి
నిచ్చునివన్నియ పాండురమున

తే. గీ. ధనముచేకుఱు నతిరక్త ధాతుచక్ర
మూర్తి గాదాదు పూజా సముజ్జ్వలులకు
కృష్ణవర్ణమ్ములైన శ్రీకృష్ణమూర్తి
సకల సౌభాగ్యసుఖము లర్చకులకొసఁగు ॥

తే. గీ. అందుల హిరణ్య వజ్ర కీలానురచిత
పటిమ మణిచక్రములనంగఁ బద్మములన
భేదములు దెల్పఁగాబడు పేర్మి దనర
స్థలజ జలజమ్ములను సంజ్ఞ జరుగునందు.॥

౪౦. స్థలజమ్ము దర్దురంబగు
జలజము కోమలము నునుపుచాయల నమరున్
గలక్షేత్ర నిర్ణయమ్ములు
దెలిపెద వినుఁడింకఁ దేఁట తెల్లము గాఁగన్ ॥

సీ. వాసుదేవము శ్వేత వర్ణాకృతి హరిద్ర
చిత్రిత మా హరిక్షేత్ర మరయ
రహిఁ బైఁడి వన్నె హిరణ్యగర్భంబగు
చిరపీతవర్ణమ్ము శ్రీధరమ్ము
నారాయణక్షేత్ర మారయ శ్యామమ్ము
కృష్ణవర్ణం బైన విష్ణువగును
దగునీలవర్ణమ్ము దామోదరం బట్టి
దనిరుద్ధమెఱమి మధ్వాభ మాధ
తే.గీ. వంబు రక్తంబు సంకర్షణంబు కపిల
వర్ణములు నారసింహంబు, వామనాఖ్య
మగనె పూచాయ బహువర్ణ మయ్యనంత
మిట్టిక్షేత్ర ప్రకారమ్ము తెఱుఁగవలయు ॥

ఉ. శ్వేతము గ్నోశమిచ్చు నతసీద్యుతి లక్ష్మి పొసఁగు నీల మ
త్యాతత వృద్ధి శ్యామలము నంచిత కీర్తి ద మర్జునంబు రా
జ్యాతిశయమ్ము రక్తమును హైమము పీతము గౌరవర్ణముల్
ప్రీతి ధనంబొసంగు సిరపేర్మఁ డనర్చు ననేకవర్ణతన్ ॥

తే. గీ. తళుకు మెఱుఁగు గలది దార ప్రదంబగు
గ్రాహ్యమింకఁ దెలియఁగా వినుండు
స్నిగ్ధసూక్ష్మ వృత్త శీతలాంగ సగహ్వ
రములు మస్తకోన్నతములు మేలు ॥

తే. గీ. చారుచక్రవాము చక్రముల్ మధ్య చ
క్రంబు వృత్తవక్రకముల నిభము
లనఘములు దలంప వనమాలికాయుక్త
మమిత ఫలము గ్రాహ్యమగు మనుండు.

సీ. స్నిగ్ధంబు నిష్టార్థ సిద్ధి సూక్ష్మము దివ్య-
ఫలము శీతలము ముత్ప్రదము వృత్త -
మనురించు సద్వృత్తి యౌన్నత్యమస్తక
మత్యున్నతి పొసంగు ననఘచారు

వాయుపుత్రకములు రమత్స్య చక్రంబు
నతికీర్తి పుత్ర పౌత్రాభివృద్ధి
కేరము మోదనుగ సగహ్వరముఖీలేఖ్య
ద మురియ నవకములాభ మమిత

తే. గీ. ధాన్యధనధేనుఫలమిచ్చు దనరుభిన్న
మధికముగ గొద్దివెడయుపు నతకఠినము
గాని షడ్వర్గ రాజ్యభోగమ్ములొసగు
చక్రపంచక మిహపరసౌఖ్యదంబు ॥

మ. వనమాలాన్వితమైన మూర్తియొడ శ్రీవామాక్షితోనుండు న
వ్వనజాక్షుండతువంటి మూర్తి యెసనె వ్వా నింట దారిద్ర్య దు
ష్టనిశాటోగ్రబాధ, శోక [ఘన] కార్శ్యంబుల్ చోరంబోవు, త
ద్ఘను గేహమ్మున మోక్షమంతమున నిస్సందేహతన్ జేకుఱున్ ॥

తే. గీ. ఆమలక ఫలంబు తుల్యంబులగుచు సూక్ష్మ
చక్రయుగ యుక్తిదగుమూర్తి చక్రపాణి
యిందిరా దేవితోనుండు నెంతయెంత
సూక్ష్మ శిలలంత లెంతయు శుభములిచ్చు ॥

కం. క్షీరములఁ దండులమ్ముల
నారూఢిగ నుంచి కొల్వ నధికంబైనన్
ధీరులు సాలగ్రామను
లారసి గ్రహియింపవలయు నధిక ప్రీతిన్.

సీ. అగ్రాహ్యము వికరాళాతి కరాళ తి
ర్యగ్వక్త్రి పృథు వక్త్రి మవ్విదిజ్ము
ఖంబు లూర్ధ్వాధో ముఖంబులు పార్శ్వ వ
క్త్రిము తుండముఖములు కడఁక బద్ధ
చక్రము చక్రంబు చక్ర వక్రము భిన్న
విషము భగ్నమనుక్త వివిధ సంక్తి
చక్రముల్ గలయవి సరవి ధూమ్రాభ పిం
గళ కళంక వర్ణములు మధురుచి

తే. గీ. భగ్నభగోత్కృష్ట బంధుక స్ఫటికదర్దు
రములు సందిగ్ధ వర్ణమ్ము లమిత మల్ప
మధిక మస్తక నిమ్నంబు లమరు సలిల
ధారణములైన మూర్తులు తగదు సుమ్ము.

చం. గుఱుతులు లేని రేఖల త్రికోణములన్ వెస చిహ్నహీనతన్
బరగు శిలాశకమ్ము లతి పాండుర దగ్ధత పృష్ఠరూక్షతన్
బొరిసిన భిన్నతంబులును స్ఫోటములందగ ఛిద్ర పీత వి
స్ఫురణముగల్గు మూర్తులవి పూజలు సేయ రిహైకవాంఛితుల్.

ఆ. వె. మిశ్రలక్షణముల మేలి వర్ణముల
లక్షణముల మూర్తిలక్షణములు
క్షేత్రగతులు దెలిసి చెప్పంగఁదగు బుద్ధి
మంతు లింక ద్వారమాన విధము.

కం॥ చుట్టు నొకయష్టమాంశము
పట్టగు ద్వారము శుభము పాతికపాలన్
నెట్టుకొన మధ్యమంబగు
గట్టిగఁ ద్ర్యంశైకమైన కడ వహి దెలియన్.

కం. బహుమూర్తులు దెలియందగు
విహితంబగు లక్షణముల వెస క్షేత్రములన్
రహియించు వర్ణరూపా
వ్యూహముల బుధులైనవారి వారిత బుద్ధిన్.

సీ. తలఁప మత్స్యాద్యవతారముల్ పది కేశ
వాదులు కపిలుఁడు యజ్ఞదత్త
హయ శింశుమారులు హంస పరమ హంస
కూర్మ వైకుంఠ ముకుంద పుండ
రీకాక్షులమల లక్ష్మీకాంత దేవేశ
వట పత్ర శయన విశ్వంభరులును
సత్యవీర శ్రీపస కనకాంబర విశ్వ
రూప తార్క్ష్యధ్వజుల్ రూఢి నమృత
† హరణ చక్రపాణులల బహురూప నా
రాయణము సుదర్శనాభిధంబు
నటు జగద్యోని పారిజాతాహ్వయుండ
నంతుఁ డివి హరిమూర్తు లత్యంత మహిమ.

కం. ఇవి యేఁబది యింకన్విను
శివహరిహర పూర్వులనఁగ శ్రీమూర్తులనన్
భువినారాయణుఁడు స్వయం
భవు చతురాస్యుండనంగఁ బొలుపగుమతియున్.

† యెత్తుగీతి సగమాటవెలఁది సగము తేఁటగీతిగా నున్నది.

తే. గీ. అల్ప ఫలంబున్ను దనఘ హేమయుఁ దనంగఁ
బురుషుఁడును సూర్యుఁడనఁగ నమర విదూత్త
బహువిధంబుగ మూర్తులు పరఁగవిల్లు

... ... ... ... ...

వ. ఇక ముఖవతి రెండును గౌరీనాథ శివనాభాది శివమూర్తి పంచకంబునుం గూడఁగ డెబ్బదియాఱు సింహాసనాటి ముఖభేదమ్ములగు దత్తల్లక్షణమ్ము తెలిం గించెద

సీ. ఏక చక్రమ్ము వెలివెసఁగు పద్మము వృత్త
పీఠమ్ము పరమేష్ఠికవిలు చిన్నె
లష్ట చక్రములు నాల్గగు వక్త్రములు హరి
ద్వర్ణమ్ము గల్గు పైలోమములుండు
ఒలువు హిరణ్యగర్భము వక్త్రముల స్వర్ణ
పటు బిందువులు శుభప్రద మగుటయును
హేమగర్భుఁడు ద్వారహీత సైన్య శీతల
మూర్తి శుభంబు లిమ్ముగ నొసంగు.

తే. గీ. హ్రస్వవదనమ్ము పృథునాభి యధికపృథుల
చక్రపార్శ్వగ లాంఛన సరసిజములు
[నా?] ం తరధ్వని స్వర్ణమిశ్రాకృతియును
గలిగిన హిరణ్యగర్భంబు గడు శుభదము.

కం. ద్వారం బివల నావల
నారూఢిగఁ జంద్రవర్ణమై స్థూలంబై
మీఱెడు హిరణ్యగర్భము
సారలసన్మహిని శుభము చాలఁగ నిచ్చున్.

తే. గీ. నలువు గొడు గందమును ద్వారనాసికమున
బిందువు హిరణ్యగర్భ మింపొందు మిన్న
రెండు చక్రంబులున్ బార్శ్వరేఖ లమరు
నాలుగింటఁ జతుర్ముఖలీలమరు.

కం. తలమీఁద వలయరేఖలు
గలుగు నలువు నిడివి నోరుగల్గ స్వయంభూ
జ్వాల సంజ్ఞఁ దనరుఁ బూజా
ఫలమతులముభుక్తి ముక్తి బాగుగ నొసఁగున్.

వ. ఇంక మత్స్యమూర్తుల నెఱింగించెద దీర్ఘాకారంబులును శ్యామలచిత్ర శబ[ల] వర్ణంబులును పృష్ఠచక్రయుక్తంబులునై యైదు తెఱంగులఁ బరగు నందు.—

సీ. ప్రక్కల శబల శోభన రేఖలనుకమ
స్నిగ్ధంబు దళు కొత్తఁ జెలఁగునదియు
నట్లయ్యు బిందువులనుబొంద నొక దంష్ట్రి
విషమ చక్రంబుల వెలయునదియు
ముఖమున నొక చక్రమున్నల్గి శ్రీవత్స
బిందు మాలికలఁ జెన్నొందునదియు
కంచుఛాయల మిన్న గల్గి చక్రద్వయ
వదనమ్ము జెలువొందఁ బొదలునదియు

ఆ.వె. నిట్టి చిహ్నములనుబట్టుగుఁ బృష్ఠను
శిరము బిందువులను బరగునదియు
మత్స్యమూర్తు లిట్టి మహితాకృతుల నొప్పు
కూర్మ మూర్తులకును గుఱుతులింక.

ఉ. ఉన్నత పృష్ఠ భాగము సముజ్జ్వలబిందులు వర్తులమ్ములున్
మున్నుగ శ్వేతవర్ణ ఖురముల్ మకరాకృతులున్ దురంగపున్
జిన్నెల రూపముల్ దగ విశేషపు వన్నెలు స్వర్ణరేఖలున్
సన్నుత దామ మొరయగు చక్రములుండగు కూర్మపంక్తికిన్.

కం. అది పది తెఱఁగుల శ్వేతా
స్పద ఖురమునఁ జక్రకంబు సకల శుభదమౌ
వదనమున రేఖ నిడివిం
గదిసి రవివలయములైదు గలది శుభమగున్.

కం. కనకచ్ఛవియౌ స్నిహిత్రా
న్నన చందపుఁ జక్రయుగమున యవృత్తంబౌ
ధనధాన్య పుత్ర పౌత్రద
మనఘంబగు కూర్మమూర్తియనుపమలీలన్.

ఆ. వె. ముసలిరూపు నిమ్న మెసఁగిన వదనంబు
నాభి చక్రకంబు శోభనాన
నంబు నలుపు నెఱుపునను బొల్చు నొక్కటి
నలుపు సోమబిందు వాలయు నొకటి.

తే. గీ. వక్ర చక్రము దక్షిణ వదన శంఖ
చక్ర చిహ్నముల్ వృత్తంబు సరసిజాప్త
నిలయములు నైదు తమ్మియుఁ గలది సర్వ
కామదంబగు కూర్మంబుగా నెఱుంగు.

కం. కమలా కృతిదీర్ఘంబై
యమరెడు దక్షిణపు వదనమటు ప్రక్కలఁ గూ
ర్మము గతియు నాభి చక్రం
బమరినఁ గీర్తిదము కూర్మ మారయ నెలమిన్.

మ. అవనిన్ స్థూలము దట్టమున్నలుపు చిత్రాంగంబునుం గూర్మ మి
ట్లు వినోదంబుగ రెండు నొక్కటిగ నుండున్ జంపమై శంఖ చ
క్ర విధంపున్ గుఱిగల్గి నోఁటి తుదఁ జక్రంబున్న [యా] రీతి కూ
ర్మ వరాహంబతి సౌఖ్యదంబు నిఖిలార్థంబిచ్చు పూజింపఁగన్.

సీ. ఎలమి వరాహ మూర్తుల లక్షణము విను
మగినె పూచాయ నైల్యంబు శ్యామ
లాకృతి నెఱుపు నల్పసురు వర్ణములు భూ
వలయమ్ము దంష్ట్రలు గల గుఱుతులు
దీర్ఘాస్యవలయముల్ ధృతిద్వార దేశ చ
క్రములు గల్గినదివరాహ మొకటి
మూఁడు రేఖలు స్థూలమును శక్తి లగ్నంబు
విషమ చక్రము నల్పు విధము నొకటి

తే. గీ. యలకలువ చాయ నిడి [వం?] ద మైననోరు
చరమతనువున జర్జరీ స్పష్ట మొకటి
కౌస్తుభను పాదలాంగూలకముల రేఖ
ల మరఁదగు భోగమోక్షదంబైన దొకటిఁ

తే. గీ. అంకుశాకారవదనంబునందుఁ గోఱ
గలది భూప్రద వారాహ మిలను ఖాన
నమ్మపై చాయ సూక్ష్మరంధ్రమునఁ జక్ర
దంష్ట్రి యుగమున్న మూర్తిరా ధరణి యొసఁగు.

కం. నిడివి బృహత్కేశంబులు
నడుగులు వాలమ్ము ఛిద్రమగు తనుకాంతుల్
కడురక్త నైల్యములు నై
య్యెడలన్ విష్టరవుఁగిటి మహీప్రదమరయన్.

తే. గీ. పాడవర్థో వక్త్రమును నిగ్గులడరు మిసిమి
గలది ధాన్యవరాహమ్ము చెలువు ముఖము
పెద్దయున్నత మస్త త్రిబిందు సూక్ష్మ
చక్రముల నమృతవరాహసంజ్ఞనమరు.

చం. నలుపును బచ్చచేఁ బొడవునందగు వెన్ను హరి ప్రకాంతి చె
న్నలరునధః ప్రదేశము మహామణి చిహ్నము వైజయంతియుఁ
గలలిత వత్స పార్శ్వగత చక్రములుండిన లక్ష్మివేరిమిన్
గలుగు వరాహమూర్తి సుఖగౌరవ మోక్షము లిచ్చునెంతయున్.

తే. గీ. దీర్ఘమును గోణమును దంష్ట్రి తెల్వి మాలి
కయును శ్వేతవరాహమ్ము ఘనతనాల్గు
చిహ్నముల్ ఘోణి మోక్ష సంసిద్ధిదంబు
బ్రహ్మచారులు పూజింప భాగ్యమరయ.

సీ. నరసింహమూర్తుల నెఱిఁగింతుఁ గపిల వ
ర్ణంబులు దీర్ఘోదరములు గలవి
బహువర్ణ యుక్తముల్ బహుచక్రయుక్తముల్
కలవవి వేర్వేరుగా వినుండుఁ
గడు కొద్ది చక్ర యుగ్మము మాలికయు బాల
నారసింహంబు సంసారహరము
ముఖయుగ్మమున స్థూలమునను విద్యుజ్జిహ్వ
మది లేమినొనఁగూర్చు ననుదినమ్ము

తే. గీ. దీర్ఘ చక్రము మిన్నలు దీర్ఘమైన
యది విభీషణ మధిక దంష్ట్రాకరంబు
ముందట న్పార్శ్వముల నల్పు మొనయు చక్ర
మును నధోముఖ మది యిచ్చు మోక్ష పదవి.

కం. బహువక్త్రద్వారంబుల
బహువర్ణ బహూదరములఁ బాతాళమగున్
బహు[ళో?] ద రాల్ప చక్రో
ద్వహమున నది కుక్షినృహరి వైఖరి వెలయున్.

తే. గీ. సప్త చక్రము బహుముఖ స్వర్ణమయము
సరదమగు వక్త్రమతి శుభ్ర సర్వముఖము
భిన్న వక్త్రము ఛిద్రములున్న రాక్ష
సాఖ్య నరసింహ మది యిచ్చు నగ్నిభయము.

సీ. రక్తబిందుల విదారణమనఁదగునది
హేమప్రభన్వికృతాస్యమగును
తఱచుపఙ్క్తిముల విదాహకమనఁదగు
స్థూలమైనది మహాజ్వాలమగును
సరవిదంష్ట్రలఁదగు జ్వాలానృసింహంబు
కాపిలం బెఱుపు చక్రద్వయమునఁ
గడుబద్ధచక్రముల్ కపిలాఖ్యచేనొప్పు
దంష్ట్రలజిహ్వలుదగినదదియె

తే.గీ. చాలచక్రంబులో సూక్ష్మచక్రబిలము
గలది లక్ష్మీనృసింహంబు గపిలకాంతి
ఛాయనోరుసు బంగరుచాయగలది
యదియయైనను బ్రహ్మచర్యార్హమగును॥

తే.గీ. వామచక్రత్రిబిందువుల్ వఱలునలుపు
చెలఁగుచున్నది లక్ష్మీనృసింహమూర్తి
భుక్తిముక్తి ఫలమ్ములింపుగనొసంగు
రాజితోదారమహిమచేఁదేజమెసఁగ॥

కం. కపిలమ్ముత్రిబిందుయుక్తం
బుపమింపఁగఁబంచబిందుయుక్తంబైనన్
నిపుణతయోగానందం
బపరిమితసుఖంబు మోక్షమర్పకులకగున్॥

కం. ఇవిరెండు తక్కఁదక్కిన
యవి వటువులుయతులు దక్క నర్చననేయన్
భువినిగృహస్థులుబూనరు
వివిధైహికఫలములిచ్చు విధములుగామిన్॥

సీ. వర్తులమ్ములు కొద్దివారవిసూక్ష్మచ
క్రమ్ములుబిందువుల్ గ్రమ్మునట్టి
నగి [నై ?] పూచాయచేనమరు వామనమూర్తు
లాభేదములువినుఁడంచితమతి
వర్తుల హ్రస్వమ్ము వామనమొక్కటి
కడప పూరూపురేఖలది యొకటి
సితబిందువులనతసీద్యుతినొక్కటి
హాలికాహరి నీల లీల నొకటి

తే.గీ. ఛత్రశిరమును బిందువుల్ స్వర్ణరేణు
భాతి హ్రస్వాంగవామన ఖ్యాతినొకటి
ఛత్రమండలబిందువుల్ సరవివక్త్రి
బిందువుల మున్ను పుష్పంపుటందమొకటి॥

కం. సిద్ధమున స్పష్టచక్రము
తద్ద్వయుగహ్వరము దీర్ఘతం దగునోరున్
ముద్దగు రేఖావలయము
లద్దేవుఁడు భూప్రదాఖ్యమగు వటుఁడెలమిన్.

కం. నిగ్గున్ సూక్ష్మద్వారము
నగ్గలికన్ స్వర్ణబిందులగు వామనుఁడే
ట్లగ్గగుగుణితులు సూక్ష్మము
నొగ్గఁగ నున్నతశిరుండు నొసఁగుంగోర్కుల్॥

ఆ.వె. నిగ్గు కార్శ్యకంబు నెఱిమధ్యచక్రంబు
సర్వకేష్టదాయియైన మూర్తి
యగినె పూవుచాయతై కించిదున్నత
మస్తకంబు మూర్తి మహిమ యతుల॥

సీ. నీలమేఘాకృతిమాలిక సూక్ష్మరం
ధ్రము కుక్షివిరివి రమ్యము దలంప
నీలాభ పద్మంబుమాలిక గల్గు హ్ర
స్వపుమూర్తి శుభదమీచందమరయ
దధిబుద్బుదంబులు దగిలి నీ [లాబ్దంబు]
వడువైనయది దధివామనంబు
స్నిగ్ధంబు వర్తులస్థితి శ్యామరుచి బను
పైమించునది దధివామనంబు

తే.గీ. హ్రస్వమతిరక్తబిందువులర్కభాతి
చక్రపార్శ్వ స్నుహీప్రసూనక్రమంబు
కడప పూరీతి నచ్ఛ్రియగతి దగు దధి
వామనంబర్చ కానేక కామదంబు॥

ఉ. బంగరుబిందువుల్ నలుపుపైఁదగునిగ్గుల శ్యామవర్ణమున్
రంగగు నాస్యచక్రములు రాజిలఁగా దధి వామనంబగున్
సంగతి రెండుఖండములసంగతి నిగ్గగు మాల్యబిందువుల్
పొంగుచు సర్వకామ సుఖభూతి వవామన మెంచిచూడఁగన్॥

తే.గీ. రక్తనీలాభదధి బిందురచితమటుల
నూర్ధ్వచక్రాగ్రదధి బిందుప్రాప్తమూర్తి
భూమిదధ్యుక్త గోపాలనామనంబు
మృత్యుదారిద్ర్యహరణమ్ము మేటిశుభము||

సీ. భృగురామమూర్తులు దగుపలువన్నెల
పరశు రేఖలు దంష్ట్రనెరయ బిందు
సంగతి శ్వేతకృష్ణద్యుతులరుణమ్ము
ఘటిత చక్రమునిడిబిలము చక్ర
భాగబిందు సదంష్ట్రభాతి రేఖలు పర
శ్వాకృతినున్నట్టి [భద్ర] మూర్తి
రాజులకర్హంబు పూజలకవివెన్కఁ
బరశురేఖామనోహరపదనరి,

తే.గీ. యన్ని విన్నెలులేమి శాంతాఖ్యశుభద
మట్లు దూర్వాభమున్నత మగుచు నాభి
రేఖయు మనోజ్ఞ చక్రముల్ రీతినమరు
నదియ జమదగ్ని రామాఖ్యనతిశల్లు

తే.గీ. పీతవర్ణ ధనుర్బాణబిందుయుతము
పరశుచిహ్నంబునగిసె పూపగిది రామ
మూర్తు లపమృత్యుహరణముల్ కీర్తిదమ్ము
లింక శ్రీరామమూర్తులనెల్ల వినుము||

సీ. కుక్కుటాండమురీతి కోదండగతిఁజాప
బాణతూణీరముల్ రాణమెసఁగ
ధృతిఁబృష్ఠమునఁ బంచరేఖలుగల్గిన
బాలరామము పుత్రభాగ్యదాయి
శ్యామలోన్నత పృష్ఠసవ్యాపసవ్యతూ
ణీరకల్పద్రుమాన్వితము పిఱిఁది
ఛిద్రమ్ముగలమూర్తి చెలువుగ దాశర
థ్యాహ్వాయమదియఁబూర్వానురూఢి

ఆ.వె. చాపబాణబిందు సహితమ్ము స్థూలమ్ము
దీర్ఘనాభి చక్రధృతినినదియె
నీలజలద భాతి నెఱివర్తులమ్ముకో
దండరామమునఁగఁదనరియుండు||

ఉ. నేరెడుపండు బోలితగునీలత వెన్నుననుండి నోటిదాఁ
కా రుచిరాంశుకాకృతివికాసము కుండలముల్ లలాటరే
ఖారతి హేమచాపమును గల్గినబిందువు కృష్ణక్షేత్రపున్
శ్రీరఘురాముఁడో కలినిఁజేరఁగనీయఁడు పుత్రదాయియై॥

తే.గీ. శ్యామమున్నతచరమంబు చాపరేఖ
తెలమిద్వారంబున్ పార్శ్వములను రెండు
గలుగ దశకంఠహరణదోర్బలుఁడు రాముఁ
డరివినాశన మొనరించు నంచితముగ॥

తే.గీ. సూక్ష్మకేసరచక్రముల్ సూనదామ
రచితకుండలమగు వీరరామమూర్తి
పార్శ్వఖురములుదలవిల్లు బాణముగల
దృష్టరామంబు భుక్తిముక్తిప్రదంబు॥

తే.గీ. రక్తబిందువుతోడఁ జక్రముకరాళ
విదితముఖచాపచిహ్నిత విజయరామ
మేకచక్రంబు ముఖసీమ నెసఁగుకృష్ణ
వర్ణశోభన మొసఁగు పావనశుభమ్ము॥

కం. నలుపున్వనమాలిక శో
భిలు భానుత్రయముస్వర్ణబిందువు దలపైఁ
గలజానకీవిభుండిల
వెలయున్ సకలేప్సితములు వేడ్కనొసంగున్॥

సీ. చాపబాణాంకుశచ్ఛత్ర చామరకేతు
దామమ్ములున్న సీతారఘుపతి
వామహస్తద్వారస్థ వరచక్రకల్పకా
ధోవక్త్రకుండల శ్రీవిలసిత
మదియెసీతారామ మఖిలార్థఫలదంబు
గోఖురపుచ్ఛ సంగుప్తమదియొ
యిట్టిచిహ్నమ్ములనెసఁగు బహిశ్చక్ర
యుతము సీతారామ మతులమదియు

తే.గీ. చారుసవ్యాపసవ్య తూణీరయుగము
సీతచక్రంబుగలయది చెలఁగునతుల
గలుగుటతులుండె నాల్గుచక్రముల నేక
వదనయుక్తిచతుశ్చక్ర మదియెయుంగు॥

శా. ద్వారద్వంద్వము నాల్గుచక్రముల మూర్ధంబొంట సొంపొందఁదూ
ణీరాద్యాయుధ కల్పచిహ్నములు వర్ణింపంగ బ్రక్కెండలో
దారంబైనది పంచచక్ర మతిమోదం బాయురారోగ్యను
శ్రీరమ్యాఖిలకామదం బగుమహాశ్రీఁ బొల్చుతద్దేహముల్॥

తే.గీ. పార్శ్వమున రెండురెండు నేర్పడఁగ శిరము
నందునొకచక్రమున్నఁ బట్టాభిరాము
డదియు నెన్నఁగ నతివైభవాస్పదంబు
మున్నుఁజెప్పిన చిన్నెలనెన్నికెర॥

కం. ద్వారద్వయమున నాలుగు
నారయఁజఠరమున శిరమునందున రెండున్
జారుతరచక్రభూషా
ధారత షట్చక్రమరయ ధరణిజ చిన్నెల్॥

సీ. ముందఱవదనముల్ మూఁడిటఁజక్రము
లాఱుపార్శ్వమ్ములనమరునొకటి
బాణతూణీరచాపము కల్పకమ్ము సిం
హాసనచిహ్నమ్ములలర సప్త
చక్రపట్టాభిసంజ్ఞంగల రాముఁ డ
భీష్టదాయకమట్టి పేరఁగల్గి
యున్నతచరమంబు చిన్నెలుదగఁబంచ
ముఖసూక్ష్మదశ చక్రములఁబొసంగి

తే.గీ. ఘనశిరఃపార్శ్వ కలితచక్రద్వయమున
నైనఁగ్రిందటఁ గూర్మచక్రాంకమైన
నమరద్వాదశ చక్రపట్టాభిరామ
ముది మనోభీష్టదాయక మఘహరమ్ము॥

కం. తూణీరాకృతిధనువున్
బాణము నానాయుధములు ప్రస్ఫుటమైనన్
నాణెమగు రామపంజర
మాణవమలహరణమగుచు నది జయమొసఁగున్॥

సీ. బలరామమూర్తులయ్యెలవు నీకెఱిఁగింతు
హలముసలముల శ్వేతాభమసుర
మధుబిందువులు దమ్మిమూడ్కిని వదనంబు
గల్గినమూర్తి సంకర్షణమ్ము
చక్రమ్ము లేకపార్శ్వమ్ము పూర్వభాగ వ
స్ఫురము రక్తాభసంకర్షణమ్ము
చక్రయుగ్మము స్వర్ణసంలగ్నవదన వు
స్ఫురమున్న నదియొ సంకర్షణమ్ము

తే.గీ. హరితలోహితవర్ణమ్ము నెరయ స్థూల
చక్రబలరామ [మన్వయ ?] శాశ్వతంబు
శంఖచక్రగదాకృతుల్ సరవి నడుమ
గలిగి కనుపట్టు శుభదసంకర్షణంబు॥

తే.గీ. గొప్పయును దీర్ఘమగు తోరు నొప్పుగల్గు
చక్రయుగ్మము వెల్గు ముసలహలాది
చిహ్నితంబును గుముదభాసిత నిరూఢ
వదన బలరామ మది వంశవర్ధనమ్ము॥

కం. వామదిశఁజక్రముల్ రే
ఖామానిత దక్షిణాంక ఘనలాంగల ను
శ్రీమించు శాంతవర్ణుల
రాముఁడు లాంగలిక ముఖ్యరాముండనగున్॥

కం. అంతయు నరుణచ్ఛవి న
త్యంత లసచ్చక్రయుగ్మమగుచోఁ [దగ] న
య్యంతిక చక్రములున్నఁజి
రంతనమగు సీరపాణిరామమనఁదగున్॥

సీ. పీతవర్ణము వింటిరీతి వక్త్రము చాప
శరశుచిహ్నముల నేర్పడిన దొకటి
కడవ పూచంద మాకారంబు బిందు చా
పాంబుజ బాణచిహ్నములు పిఱుఁద
ఛిద్రంబు పీతాభభద్రరేఖయుఁగల్గు
కీర్తిప్రదము రామమూర్తి యొకటి
షట్చక్ర ముభయపార్శ్వముల నాయుధములు
శోభనవదనముల్ సుసుషిరంబు

తే.గీ. కల్పకంబు నత్యంత వికసనమమరు
రక్తమధునీల వర్ణత్రయయుక్తమూర్తి
మహిమచే నొప్పు నదియె స్వమాత్రి(?)రామ
మిహపరమ్ము లొసంగు శుభేప్సితంబు॥

వ. ఇంక శ్రీకృష్ణమూర్తుల నెఱింగించెద—

ఉ. ఉన్నతమస్తకంబు నలువొప్పగు చక్రయుగంబు బిందువుల్
సన్నుతవేణువేత్ర ఖురసంగతరేఖలు కృష్ణమూర్తి లీ
వన్నె త్రిబిందుయుక్త మనవద్య శుభానన దీర్ఘమున్న యా
చిన్నెల బాలకృష్ణుఁడిల నేమము సంతతియిచ్చు నెచ్చుగన్॥

తే.గీ. కుచ్చఁదనమున నీలిమ పార్శ్వభిత్తి
చక్రయుగ్మము వదనంబుసాటి నాభి
పృష్ఠమునఁ గూర్చరేఖ యొప్పిదఁపు వలఁద
యైనచోఁ బాపహరకృష్ణుఁడనఁగఁదనరు॥

కం. సమచక్రద్వారము కడు
నమరఁగఁ గృష్ణాభశోభనాకృతిఁ గృష్ణుం
డమర శుభంబు లొసంగున్
సుమహితముగఁ బూజకులకు సుస్థిర లీలన్॥

సీ. వదన వతోన్నతి వామపర్యంక కృ
ష్ణాభిరేఖాద్వయ హారి బిందు
మండనుఁ గాళియమర్దనుఁ డనఁదగు
సర్వశాత్రవహారి సౌఖ్యదాయి
సవ్యాపసవ్య భాస్వద్రేఖలున్ పార్శ్వ
ఖురసూక్ష్మ చక్రముల్ కెంజాయమూర్తి
యది ధనంజయవిభుఁడనఁదగి శుభమిచ్చు
రక్త బిందులు శ్యామరచితవర్ణ

తే.గీ. మొనరఁగా నొప్పు దంతి కరోపమాన
రేఖ దక్షిణమున ముష్టిరీతి బిందు
వమరఁ జాణూరమర్దనాఖ్యానకృష్ణుఁ
డమిత సౌభాగ్యమొసరించు నంచితముగ॥

తే.గీ. పార్శ్వవదనమ్ము తగు పూర్వభాగముఖము
శుద్ధనీలాంబరప్రభాశోభి కంస
మర్దనాఖ్యానమది కృష్ణమహితమూర్తి
పూజకాభీష్టదాయియై పొల్పుమీఱు॥

కం. స్థూలము కణయుక్తములగు
మేలిమిచక్రములు నురియ మిసిమి తనరుచుల్
చాలన్ శ్రీవత్సాంకితుఁ
డాలలిత శమంతహారి యశము లొసంగున్॥

మ. తనుదీర్ఘంబతికృష్ణవర్ణమును సార్ధంబైన చక్రాళి ప
జ్జను నిమ్నాస్యము గల్గఁ బుత్రదుఁడు శ్రీసంతాన గోపాలుఁడౌ
ననుపున్ శ్యామము ఛత్రరీత్యరుణబిందుల్గా శిరఃపుష్కరం
బును నూత్నానన సీమ బిందువుల నొప్పన్ గృష్ణుఁడిష్టార్థుఁడై॥

తే.గీ. కుక్కుటాండమురీతి లాంగూల వేణు
డోలికాకుండలమ్ములు మేలి నిగ్గు
పరగ లక్ష్మీ నివాసగోపాలమూర్తి
భాగ్యదాయిని పుణ్యసంప్రాప్తమదియు॥

సీ. దామంబు పంచాయుధమ్ముల చిన్నెలు
భృత సూక్ష్మచక్రముల్ కృష్ణమూర్తి
రహి నిదియె బహూదరము వేణువున్ దైర్ఘ్యమ్
మమర శ్రీగోపాల మనఁగఁబరగు
దనరు నైల్యము శృంగదండ పార్శ్వము వేణు
వదనంబు తదోగ్రపవల్లభుండు
కుండలమాలికల్ రెండు పార్శ్వమ్ములఁ
దరుయుక్త కార్ష్ణ్యమ్ము మెఱసెనేని

తే.గీ. మదనగోపాలుఁడగు నీలిమంబు నెఱుపు
చెరిసగమ్ము దీర్ఘమును సుషిరము చక్ర
శరశరాసన శంఖలాంఛనము గలుగు
నిట్టిమూర్తులు సకలాభీష్టదములు॥

కం. వలుఁదయు రాజితబిందులు
తల నిమ్నము నిడివిగల్గు దక్షిణభాగం
బలరన్ గోవర్ధనధరుఁ
డలఘుత రైశ్వర్యదాయియై విలసిల్లున్॥

తే. గీ. అటుపఁ బ్రద్యుమ్న సూక్ష్మచక్రములు మీఁద
వస్త్రిచిహ్నము క్రిందటు వరుస వృత్త
చారుచిహ్నము వస్త్రాపహారి కృష్ణుఁ
డఖిలకామ్యము లొసఁగూర్చు నర్చకులకు.

క. స్థూల శుభచక్రయుగళుఁడు
మేలి గదాకార మధ్యమిశ్రిత రేఖా
ద్యాల శుభాంగుఁడు కృష్ణుఁడు
సాలఁగ ధనధాన్య విభవ సౌఖ్యములొసఁగున్.

సీ. కలికిమూర్తులు నిల విలసితాకృతి దీర్ఘ
మగు నంకుశాకారమైన నోగు
వనమాలికయుఁగల్గి వరకల్కి మూర్తి నా
నురుశుభసుకృతమ్ము లొసఁగ నిచ్చు
నతిరక్తత సూక్ష్మమగు బిలంబును వెన్క
చక్ర శరాసనాంచత్కృపాణ
[ములఁదనరెడు] మూర్తి కలివినాశనకర
మని యొప్పుఁగుఁడు శుభమనరనొసఁగు

తే.గీ. విరివిగల గహ్వరము చక్రవిధము లేమి
పూని నిర్వాణబుద్ధునిగా నెఱుంగుఁ
డనఘ వినుమింక శ్రీ కేశవాదిమూర్తి
భేదములు దేఁటపడఁగఁ బ్రమోదమెసఁగ.

క. కనకరచిత బిందువులన్
ఘనమై సూక్ష్మమగు చక్రకము శ్యామంబున్
వనమాలికచేఁ గేశవ
మనఘ చతుష్కోటి యుక్తమది శుభదమగున్.

సీ. నారాయణమ్ములు నాభిచక్రమ్ములు
న్నతములు వలుఁదలు నలుపు లెలమి
కనకచూలికయు రేఖాత్రయయుత మున్న
తం బపమృత్యువిదారణమ్ము
స్థూలచక్రంబులు మేలి శ్యామాభయు
ననువైన దఖిల శోభనకరంబు
నేకచక్రము గాను గాకువర్ణము స్వర్ణ
కాయము వీరనారాయణమ్ము

తే.గీ. సుముఖశోభన మధ్యచక్రములు కటక
హార తాటంకయుతము మాయాభిధంబు
నగుచుఁ బూజాభిరతులకు ననవరతము
నాయురారోగ్య మొసఁగు నారాయణమ్ము.

క. పీతాభ మేకచక్రా
ఖ్యాతధ్వజ వజ్రచిహ్నమా లక్ష్మీము
ఖ్యాతత నారాయణ మ
ల్లైతగు చక్రద్వయమున నది శుభ మొసఁగున్.

సీ. వామచక్రంబు పూర్వాగ్ర చిహ్నిత పద్మ
మమర శ్రీ నారాయణాఖ్యమదియు
ఖగచక్ర ముఖ్యరేఖలు వామచక్రముల్
రమఁ గూడియుండు నారాయణుండు
పంచాయుధంబులు పద్మగదా వామ
చిహ్నముల్ శ్రీ లక్ష్మిచెలువు గలుగఁ
గ్రమమున నేకచక్రము ద్విచక్రమునఁ ద్రి
చక్ర చతుశ్చక్ర సంజ్ఞలందగు

తే.గీ. రమణ లక్ష్మీశయుక్త నారాయణములు
మఱియు నొకటైన నాల్గైన మహితచక్ర
ములు గుఱుతులుండి కొలఁదివై వెలయుమూర్తిఁ
జూచినంతనె చేకుఱు శోభనములు.

శా. ఛత్రాకార దృఢమ్ము లొప్పగు చతుశ్చక్రమ్ములన్ స్నిగ్ధమున్
జిత్రాస్త్రాన్వితమున్ ద్రిభిన్నము ధ్వజశ్రీవత్సనామాంకమున్
బాత్రంబై తగు గోఖురంబుల లసద్భద్రాసన స్థైర్య మి
ద్ధాత్రిన్ మూర్తులకెల్ల నుత్తమమునాఁ దళ్కొత్తు శ్రీయుక్తమై.

క. నేరేడుఁ బంటిరూపున
నాగాధిగ నెల్ల చిన్నెలమరిన లక్ష్మీ
నారాయణ మనఁదగు నది
యారసి కనుగొనినయంత నఘములు దొలఁగున్.

సీ. మున్ను జెప్పిన చిహ్నములు గలయవియు ల
క్ష్మీయను యుక్తనారాయణాహ్వయములు
గల వెన్నియైన రేఖలు మూఁడుగల్గిన
పృష్ఠగర్తమున నొప్పెసఁగు వామ

వర్తులమ్మునఁ బక్షిపరరేఖ నాగభో
గమున శ్వేతమగు రేఖలను రెంటఁ
బొరిది నాలుగు రెండు సుషిర గంభీరమ్ము
లున్న చక్రమ్ము లాఱున్న వెల్లి

తే. గీ. భుక్తిముక్తి ప్రదమ్ములౌ పూజకులకు
నలరు లక్ష్మీసుయుక్తనారాయణముల
వరశుభంబట్టి మూర్తులు దొరకెనేనిఁ
జెలఁగి సాక్షాత్కరించు లక్ష్మీవిభుండు

క. స్థితమధ్య చక్రములు ని
ర్గతిశయమున మధువిభున్ మహాశ్రేయస్సం
గతి మాధవమూర్తి యగున్
యతులకుఁ బూజార్హమగుచు సంచిత మహిమన్.

ఆ. వె. నైరయావర్తులమ్ము నిగ్గు గదాచక్ర
పద్మమతుల వాయు భోగనిరతి
కునుతులున్న మూర్తి గోవిందుఁ డిట్లుండి
పంచవదనయుక్తిఁ బరగునదియె.

తే. గీ. వాయుచక్ర బృహద్ద్వారవర్తులముల
కపిలరుచి మధ్యనిమ్నంబుగలుగు విష్ణుఁ
డతుల నాయుధమాలిక లమర కాంత
కుసుమరుచి విష్ణుఁడిష్టార్థ విసర మొసఁగు.

సీ. బటువు కృష్ణాభ శోభనతయునుం గల్గి
విష్ణుమూర్తియనంగ వెలయు నొకటి
స్థూలచక్రంబైన లీల క్షత్రియులకు
శుభమిచ్చునట్టి విష్ణుండు మఱియు
మెఱుపులీనెడు మొగమెఱుపు మొల్లము విల్లు
తలగలమూర్తి సంతతశుభదము
బటువు చక్రంబు శోభనమగు గదయును
బెఱుఁదఁగల్గఁగ విష్ణుఁడరయ సదియ

ఆ. వె. ఘనత నేకచక్రమును మహాద్భుత తేజ
మమితకాంతి వైభవములు మిగుల
శుభములిచ్చు మధునిషూదన మూర్తియై
విను త్రివిక్రమముల విధములింక.

తే.గీ. మూఁడు కోణమ్ములున్ జక్రములు నచటన
కలిగినఁ ద్రివిక్రమంబు నా వెలయు నధిక
యత్నమునఁ బూజనీయ మయ్యవనిసురుల
కఖిల సౌభాగ్యదాయక మగుటఁజేసి.

క. గద వామమునన్ దక్షిణ
ప్రదేశ మరయఁగల త్రివిక్రముఁడు, శ్యామంబై
వపు దీర్ఘము దామాబ్జ
స్పదమైన త్రివిక్రమంబు చతురతఁ దెలియన్.

శా. చక్రం బొక్కటి యూర్ధ్వసీమఁగడు శస్తం బేకభాగంబునన్
జక్రద్వంద్వము కుక్కుటాండనిభ మొంచన్ బుష్కరంబబ్జమున్
జక్రంబున్ గద లాంగలంబు ధ్వజముంచన్నిమ్నముల్ గల్గి ని
ర్వక్రంబైనఁ ద్రివిక్రమం బమరు దీర్ఘద్వ్యభవాధారమై.

సీ. మున్ను వామనమూర్తు లెన్నికఁ దెల్పితి
శ్రీధర మూర్తుల చిన్నె వినుఁడు
నీప ప్రమాపరే ఖాపంచకము మధ్య
చక్ర పద్మములు సూక్ష్మమగు నోరు
తగు శ్యామలాభ శ్రీధరమూర్తి మఱియు ని
మ్నావర్తశిరము హ్రస్వాకృతియును
సిద్ధిదంబగు నిట్టి శ్రీధరమూర్తి దూ
ర్వాభయు విపుల చక్రాంక మదియొ

తే.గీ. హ్రస్వమతి వర్తులంబు పీతాభదాన
చిహ్నము పొసంగు మూర్తి యే శ్రీధరమ్ము
సర్వకా మ ప్రదానైక ధూర్వహమ్ము
విను హృషీకేశమూర్తుల విధము లింక.

తే.గీ. అర్ధ చంద్రాకృతియు రేఖలైదు కడప
పూవుచాయ హృషీకేశ మూర్తి యమరు
నీల రుచికేసరమ్ములు నిడివి కేస
రములు నూర్ధ్వదారుల నమరు నదియొ.

క. పదములు నైదున్ మఱిచ
క్రదశకమున్ శ్యామలాభ గల్గి రుచిరమై
మృదుశీతలమై మిన్నలఁ
బొదలు హృషీకేశమూర్తి బుధశుభదంబై.

తే.గీ. పెద్ద రేఖలు పద్మంబు పేర్మి నమరు
వాసుదేవాఖ్యుఁ డపమృత్యువారణుండు
కలువరేకొప్పు దీర్ఘ చక్రములు గలుగు
వాసుదేవుఁడు సకలార్థ వైభవదుఁడు.

తే.గీ. పీతవర్ణంబు సుషిరముల్ పెక్కు సూక్ష్మ
చక్ర దీర్ఘాకృతుల్ గల్గి సరస నొకటి
దీర్ఘచక్రము బిందువుల్ తెలుపు నలుపు
గలుగు ప్రద్యుమ్నమూర్తి సౌఖ్యప్రదమ్ము.

మ. వనమాలాంబుజముల్ జపాకుసుమ సద్వర్ణంబు దైర్ఘ్యంబుగా
నొనరన్ సూక్ష్మములైన చక్రములఁ బ్రద్యుమ్నాఖ్య మీ లక్షణం
బున సూక్ష్మంబగు చక్రయుగ్మములచే ముఖ్యంబు బంగారు రే
ఖ నయంబౌ ననిరుద్ధమూర్తి నెఱుఁగంగావచ్చు మేధానిధీ!

సీ. ధృతి భిన్నహుళ్ళఁబు దీర్ఘ నైల్యాకృతి
యైనది యనిరుద్ధుఁడని యెఱుంగు
రేఖాద్వయద్వార పృష్ఠ పద్మాంకిత
మాస్యచక్రంబు కృష్ణాభ చణక
కుసుమాకృతియుఁ జక్రకోణమ్ము గల్గిన
యనిరుద్ధమది విభవాస్పదమ్ము
ద్వారసంకీర్ణమ్ము వనజచిహ్నము కృష్ణ
వర్ణానిరుద్ధంబు వాంఛితదము

తే.గీ. వర్తులము పీతవర్ణమ్ము వదన సీమ
మూఁడు రేఖలు వెన్నునఁ బురుహరేఖ
నమరు ననిరుద్ధుఁ డిచ్చు నిష్టార్థచయము
నింకఁ బురుషోత్తమాకృతులెల్ల వినుఁడు.

క. అతసీ ప్రభ బిందు విభూ
షితముక్ ధ్వజ పారిజాత చిహ్నిత వజ్ర
ద్యుతి వర్తనముక్ శోభన
గతిఁ బురుషోత్తమము భాగ్యకలనఁ బొసంగున్.

తే.గీ. ద్వార చక్రములంకుశోదార పాశ
ములు వెలిని లోనఁ బైన సొంపలర రెండు
వదనములు సుఖగాననాదాప్తి చాప
చిహ్నములు పురుషోత్తమ స్థితి వహించు.

దద్ధిత యర్థియుఁ దగవాక్యగయు సమ
 రసయు నానొప్పు పూర్ణమ్ము లాఱు
వనజాప్తునెడఁ జక్ర వాకముల్ చంద్రుని
 యందుఁ జకోరము లజరుల యెడ

తే. నళిచయం బెట్టు లట్టుల నంజనాద్రి
విభుని సేవలఁ బ్రజలు నావిధము లుక్త
లివియె పూర్ణల పేరుల నెసఁగు మఱియు
గలవు పదమూఁడు భేదముల్ దెలియ వరుస.

క. వెన్నెలలై యమృతంబై
యన్నీరజ నేత్రు కీర్తి యమరెఁ నటన్నన్
ఎన్నఁగ ననుక్తధర్మ ప్ర
సన్నత లుప్తయగు నుపమచందము దెలియన్.

క. హరిభుజ దండము దానవ
వరులకు యమ దండమగుచు వర్తలు ననుటల్
ధర నుక్తేతరధర్మ
స్థిర నామాలంకరణము చెలువగు మిగులన్.

సీ. గురుని శిష్యులరీతి సురలెల్లఁ గొల్తురీ
 హరిననిన ప్రతీప మనఁగ నొప్పు
నినకులంబెల్ల రాముని చేఁ బరిష్కృతం
 బైనట్లు యదువంశ మమరెఁ గృష్ణ
చేతనా నర్థప్రతీతి యామెఱుపుతోఁ
 గలజలదంబన్న నెలమి సీత
తోనున్న రాముఁడు దోఁపఁ బింబప్రతి
 బింబ భావమనంగఁ బేర్మి నమరు

తే. ద్రవిడస్వర్గంబు వేంకటధర సురపురి
యచటి జనములు దేవత లబ్జనాభుఁ
డింద్రుఁబోలెడి విభవాతి. సాంద్రమహిమ
ననుట యుపమాఖ్యఁదగు బుధజనఘనోక్తి.

క. శారద శరదురు నీరద
నారదశర పుండరీక నందిత మహితా
పారదరుచి మీఱున్ హరి
గౌరవ యశమనిన మాలికారూపమగున్.

ఉ. రాముఁడు రాములీల జనరంజకుఁ డన్న నన న్వయంబగున్
రాముని యందుధర్మము తిరంబగు నర్థము రీతి నర్థమ
ర్మైమఱిఁ గామమూ ద్వివిధ మాననఁ బ్రత్యవమర్శనామమూ
నోమిక నొందుఁజూచి మఱి యొండెఱుఁగన్ స్మరణాఖ్య మొప్పగున్.

తే. వేంకటాద్రీశుఁ డాశ్రిత వితతి కాత్మ
సేవ దయ సేయుచో భోగసీమ వెలయు
నట్టి పరవాసుదేవు నైయ్యమునఁ దలఁచుఁ
గా నొనర్చుట లారోప గర్భమయ్యె.

సీ. వహి సావయవ నిరవయవ విధాష్ట క
రూపకాలంకార రూఢులందు
హరి జయ యాత్రాంబుదాళి ఘోరని
స్వాన నిర్ఘోషణ శత్రుశైల
ములు పగుల్చుచు వారి లలనల కన్నీటి
జడి యశోంకుర సముచ్చయ మొనర్చె
ప్రౌఢి నావస్తు రూపక మగు హరి కల్ప
వృక్షాకృతిన్ గుణవితతి ధూప

తే. వాసనలు నించె జగములు వాసి గనన
బరగు నటనేకవర్తి రూపక మనంగ
కరమథనశైలమున శత్రు కంధిఁ బ్రచ్చి
రహి యశస్సుధ లోకామరత్వముగను.

వ. గాంచెననుట సావయవరూపకంబగు, నందక రాహువు దైత్య రాజమండలమ్ము గ్రసించెననుట, పరంపరరూపకాలంకా రమ్మగు మఱియును.

క. దానవ భంజన కరుణాం
భోనిధి సత్పూర్తి పంక్తి పూరి దిక్తటులం
బానె ననుట శ్లేషోక్తియ
గానఁ బరంపరితరూప కంబై వెలయున్.

సీ. జయ యాత్రదలఁచు శేషనగాధి పాజ్ఞాను
య ప్రసక్త్యయం బఖిలామరగణ
మట నమ్రమకుటంబు నట్లలంకారా
భిలాష భజించు విలాస గతుల

నననేడి యర్థము సహానాధి కరణైక్య
పరిణామమను నలంకరణమయ్యె
హరి కటాక్షములు బ్రహ్మాదులు కల్ప
దామములో ! చింతామణి మహిత రుచులో !

తే. రహిఁ బయో నిధులో! సిద్ధరస తరంగ
సంఘమో! యని యెంచి నిశ్చయము సేయు
నైన నిశ్చయ పర్యవసానసంశ
యాఖ్యమైన యలంకారమగుచు వెలయు.

క. హరి దరహాసము దిక్కులఁ
దరలఁ జకోరములు షట్పదములుఁ జ్యోత్స్నా
వరమని సుఖించె నన ను
ర్వర భ్రాంతిమదభిధ మగుచువర్తిలు నెలమిన్,

చ. అసురకులాంతకోద్భట భటార్భటి కాదు చతుస్సముద్ర వా
ర్యసమ మహారవంబగు మురాంతకు ఢక్కారవమ్ము గాదు సై
న్యసహిత భేరి గాద నేడి యర్థ మపహ్నవనామమై తగుఁ
వెస నది సవ్యమై యనృతవృత్తిన నా ద్వివిధంబులై తగుఁ

తే. తొంబదియు నాఱు నుత్ప్రేక్షలింబుగాఁగ
నవి యితర ధర్మ మొకటి యందమరఁదలఁచు
రామ పట్టాభిషేకాంబురచిత పంకి
లాంకురములనఁ బుష్పోడు లమరె ననుట.

వ. మఱియు ననుపాత్తనిమిత్త జాత్యభావస్వరూప హేతు ఫలగమ్య త్వేత్యాదులకుఁ దత
న్నామ నిర్దేశంబుల నర్థానుగతి నుత్ప్రేక్ష లెఱుంగఁదగు మఱియును—

సీ. రామ దోర్దండ ధారణము చే ధారుణి
మృదుశయ్య యనున్నట్లు మెలఁగె భూమి
ధర నివాసము మదిఁ దలఁప కప్పుడ టన్న
జాతి హేతూత్ప్రేక్ష చంద మమరు
ధరఁ గల్పకముగాఁగ ధాత రాముసృజించె
నన జాతి హేత్వాహ్వయమునఁ దనరు
నతని భేరీధ్వని యరులున్న గుహఁ గల
యఁగఁ జొచ్చెననఁగఁ గ్రియాఖ్య నమరు

ఆ.వె. సుదథఁ గల్పవృక్ష మొనరఁ బుట్టిన యట్లు
రామచంద్రుఁ డొదవె రహి ధర నన
నతిశయోక్తి యయ్యె నవి నాల్గు దెఱఁగు లౌ
పేర్మితో నభేద భేదగతుల.

ఉ. నారదుఁ డబ్ధిజేరె నది నాథము రారి వసించు నెయ్యెడన్
గారణ మేమినాఁ దపము గైకొన వేఁడిన నిచ్చె నిట్టి నా
క్షీర సముద్రుఁ బోలి తన చెల్వుగ, నాతి శయోక్తియైతగున్
మీఱి యసంగతాఖ్యమగు మేరుగభీరవరానుకారితన్.

క. మురరిపు ఖడ్గము దానవ
వర కంఠము నందుఁ గల్పవాసన కుసుమో
త్కర మనిల యుక్తిఁ బడునను
టరయంగ సహోక్తియనఁగ నతిశయ మందున్.

తే.గీ. దినదినము సూర్యుతోఁ గూడి వనజ నేత్రు
శౌర్యరమ పూర్వగిరిని నిశ్చలతఁ బొదవె
ననసురూపాసహోక్తి నానతి శయిల్లు
హరికథలులేని కృతిరమ్య మగునె యనుట,

వ॥ రమ్యతాధిక్యోక్త్యలంకారంబగు. రామచంద్రుండు పూర్ణుండును నిష్కళంకుండు నగుచునుండు, చంద్రుండు కళంకయుక్తుండిట్లు పూర్ణుండగుననుటయు రమ్యతావినోక్తి యగు మఱియు.

సీ. ఘనతవిశేషణంబునకుఁ దుల్యంబగు
ప్రస్తుత వస్తు ప్రశస్తి వినుతి
నన్యవస్తువు దోఁచు టది సమాసోక్తి యు
దానలక్ష్మీ భాస మానవృత్తి
సహ్యాంగ మహిమ నెంచంగ భద్రాత్మత
సార్వభౌమక్షితిఖ్యాతిఁ బర్వె రాముఁ
డని దిగ్గజారోపణార్థమాటది సమా
రోపణాలంకార రూఢి నమరు

తే. సుకవి రత్నను బల్కు వేఱొకటి దోఁచు
టది యౌ వక్రోక్తి ఋజువు గా నాడు మాట
లదియె వాక్యాహ్వయంబున నతిశ యిల్లు
గజము మదహత చలన రాఘవుఁడు నలరె

॥వ అనుట స్వభావోక్తి యగుమఱియును.

క. వేంకట విభు దర్శనరో
మాంకురములు వొడమఁ బ్రముదితాంబువు దొట్టన్
గొంకక తత్కింకరులకు
నంకము యని యిప్పు డనుట వ్యాజోక్తియగున్

తే. గీ. దైత్యకాంతలు తమ తమధవులఁ గలయ
నపుడు రోమోద్గమంబౌట లాత్మ శౌరి
వలనిభయ మంచు విశ్వాసకలన మాని
రనుట మీలన సంజ్ఞచేఁ దనరు నెలమి

క. జల జాక్షు కీర్తి లోకం
బుల విశదంబైన శంభుభువనాధిప శ
క్తులు నిజ వాహన రూపము
లలవడ నెఱుఁగరనఁ దద్గుణాఖ్యంబయ్యెన్.

సీ. ధర విరోధా కృతుల్ దశవిధమ్ములు వేంక
టాద్రి నాయకుఁడు పద్మాకరుండు
నైజలాశయుఁడు గాఁడన శుభతర వారి
ధారుఁడయ్యును దైత్య తాపకరణుఁ
డగు నను నివి విరోధాభాస భేదముల్
మనుపటి రాజుల ఘనయశమ్ము
రాముఁడా ధేయమ్ము గామేల్మిఁ దగునన
రహి విశేషా లంకరణ మనఁదగు

తే.గీ. నిదియుద్రి విధమ్ములగు నెన్న నిట్లు పెక్కు
విధముల విరొల్ల నెఱిఁగి కవిత్వ గతులఁ
గృతులుగావించు సుజనుఁడు కీర్తిఁగాంచు
వెలయుఁగల్యాణ వేంకట విభుని కృపను.

క. యత్నముల జనులలో స్త్రీ
రత్నమ్మును మఱియుఁబురుష రత్నమ్మును స
ద్రత్నమ్ము శిలల గజహయ
రత్నమ్ములు పశువుల యెడ రాజిత లీలన్.

క. స్త్రీ పుంస లక్షణమ్ములు
చూపట్టి గనెఱుఁగవలయు శోధితతత్త
ద్వ్యాపార శుభా శుభ ఫల
దీపితమది యగుశు శాస్త్ర ధీరతి విబుధుల్.

తే. గీ. అందు స్త్రీలక్షణము వినుఁ డంఘ్రియుగము
కుదురు మృదువునఁ దాఁబేటి పదువు లెస్స
గుల్ఫము లరోమశంబులు కుదురు బటువు
మేలు దొడలట్లు కరభమ్ము పోల వలయు.

క. నునుపు జిగి యవయవంబులు
దనరినఁ గడు శుభము పిఱుఁదు దళమగు టయినన్
వినుఁడు పురోభాగము మృదు
వనువుగ సమమైన వైభ వాధిక్య యగున్

చ. ఉదరము పై వళుల్ తెలివినొంది తగన్ త్రివిధమ్ముగా ముదం
బొదవుచు నుండఁగావలయు నున్నతి నాఱు కటారి తీఱునన్
బొదలుచు గబ్బిచన్గవకుఁ బొందుగ మధ్యమసీమఁ జేరి సొం
పు దనరఁ జీమచాలనఁగఁ బొల్చిన కామిని యొప్పు నన్నిఁటన్.

తే. గీ. సోగలగు వ్రేళ్లు చుక్కల సొబగు నఖము
లమరఁ బాటలరుచి పాణులడుగు లున్న
కాంత యొంతయుఁ బ్రభుపరిగ్రహము గల్గి
సంతతియు వైభవస్థితి చాలఁ గాంచు.

తే. గీ. చన్నులకుఁ గ్రింద నాభితో నెన్నఁగూడి
గిన్నెయున్నట్టి చెలువున వన్నెమీఱి
కడుపు గడునొప్పె నేనియుఁ బడతి పుత్ర
వతియు సౌభాగ్య వతియునై యతిశయిల్లు.

క. కనుబొమల వంపు పలువరు
స నెడంబమరమియుఁ గచనిచయమున సన్నం
బు నిడివియు నలుపు గలిగిన
వనితామణి యైదువైధృవంబుగ వెలయున్.

క. కరములఁ బదములఁ జెక్కులఁ
గర మరుదగుకోమలంబు కలువల చెలిమో
మురు కాంతి కక్షములు గల
తరుణీమణి భోగ భాగ్యతన్ వర్ధిల్లున్.

సీ. అళికపు సుడిమోము పులిపిరి గలసఖి
దారిద్ర్య పీడఁ దవిలి నదియు
గుంట కన్నులు నెఱి కుఱుచ చింపిరి వెండ్రు
కల చెలి రోగిణియై యలమటఁ బడు

వెండ్రుకలరుణముల్ విషమాక్షి విషమపాద
    పుటింతి యాపదలెపుడు నొందు
గట్టి తనువు రోమకలితచుబుకయైన
    వనిత యెన్నఁగఁ గడు వంధ్యయగును

తే. పురుషువలె కంఠ నాదమ్ము కలుగు మొగము
గుబ్బరో మమ్ములరయ నాకుఁడు గలయది ?
విధవయగు గొగ్గి పండుల వెలఁది జారి
ణియగు విషమేక్షణియు నట్లు నయగు వరుస.

వ. ఇంక పురుషలక్షణం బెఱింగించెద—

ఉ. సారస మందముల్ మృదువు చందము నంఘ్రుల నున్న మేలునా
యారుల రోమముల్ దళము నుత్కటినస్థితిఁ బర్వ నొప్పగుల్
జారుకరాబ్జముల్ బొమలు సాఁగి ప్రలంబములైనఁ జెల్వగుల్
వారక కేశ జానువులు వక్షము గుక్షియు నున్నతిం దగుల్.

సీ॥ పాదరేఖలు కేశ పాశమ్ము లింగమ్ము
    స్నిగ్ధమ్ములైయున్న నెరయ మేలు
నఖపాణి చరణోరు నయనాంతములనెఱ్ఱ
    దనమైన నైశ్వర్య ఘనత నమరు
స్వరనాభి సత్వమ్ములరయ గంభీరమ్ము
    లైన భూపాలకుండగుచు మెఱయు
కంఠోదర లలాట కాముస్త్రివళులచే
    నతిభోగ భాగ్యాయురాప్తిఁ దనరు

తే.గీ జంఘకంధర కృష్ణ హ్రస్వతయు లెస్స
చరణ రేఖలు చూచుకస్తనములుఁదగు
చక్రములుగల్గ వైభవాస్పదుఁడునగును
విరవి పాదోదరమ్ములు వెలయుటొప్పు.

తే. రోమ కూపాళి విస్తార రుచిరమమరు
నందు నొక్కొక్కటున్న రాజ్యానుభవము
రెండు రెండున్న మధ్యమరీతి మెలఁగు
మూఁడునాల్గైన దారిద్ర్యమునఁగృశించు.

కం. చెక్కుల భుజముల వీపున
ముక్కులఁ గర్ణముల రోమములు దట్టైనన్
జిక్కున్ దారిద్ర్యంబున
గ్రొక్కులు గనుబొమల పట్టుల నవిగలుగన్.

కం. తలవర్తుల త్రయంబున
నిలయేలున్ వ్రేళ్ల కనుపు లిరవగు రేఖల్
వలనన్ నాలుగు రెండున్
గలిగిన దీర్ఘాయురాప్తిఁ గడు దళుకొత్తున్.

ఆ. వె. నుదుటఁ గరయుగమునఁ బదముల నాల్గేని
రేఖలున్న భాగ్యవృత్తి నలరు
నంకుశాబ్జ వజ్రహల లసద్ధ్వజరేఖ
లడుగులన్ బొసంగ నధిపుఁడగును.

కం. కరతలమున మత్స్యాకృతిఁ
గరమొప్పగు పద్మరేఖ గల్గిన ధనద
స్ఫురణఁదగు ననామిక కను
వరయఁ గనిష్ఠికఁ గ్రమింప నాయువు పొసఁగున్.

కం. చిటికెన వ్రేలికి పై దటన్
బటుగతిఁ బెనురేఖ ఛిద్రభావరహితమై
యటఁ దర్జని మొదలంటిన
బటువుగ నూరేండ్లు బ్రదుకు ప్రస్ఫుటలీలన్.

సీ. అంగుష్ఠము నడుమయవ రేఖ గల్గినఁ
బాడి పంటలుగల్గి పరిఢవిల్లు
చిటికెన వ్రేలి క్రిందటి పెద్ద రేఖకు
నెగువ రేఖలు గల్గ మగువ లనియు
మణిబంధ తన్మధ్య మహితాల్ప రేఖలు
పుత్రులు సుతనులై పొసఁగఁ బుత్రి
కలు నటంచు నెఱుంగఁగాఁదగు నంగుష్ఠ
మూలరేఖలునట్టి లీలఁదనరు

తే. వ్రేళ్ల నిడుపులు వేర్వేఱ వెలయఁ గొల్చి
నట్టి సూత్రమ్ము మూరెడంతైనయున్న
నవతి వర్షంబులాయు వెన్నంగ నెంత
తక్కువైనను దద్గతి తగు నెఱుంగ.

తే. బాహుజానూరు యుగ్మమేర్పడఁగ పోల
యుగము సమములు విభుతచే జగతి వెలయు
జాను పర్యంత బాహువుల్ సరవిఁ గలుగ
నతఁడు మూర్ధాభిషిక్తుఁడౌ నధిక లీల.

కం. మడమలు మెడ భుజములు లా
వెడలక కుఱుచలగుచుయున్న నిలకుం బతియౌ
కడునరచేతులు కఠినం
బడరినఁ బదమృదుత నాతఁడవనివిభుఁడగున్.

తే. గీ. నిడుఁద శేఫమ్ముచే లేమి నెరయనొందు
హ్రస్వ శేఫమ్మువలన ధరాధిపుఁడగు
మధ్యమంబైన నాతండు మధ్యముండు
నిరువలన గొని జాలినెన్నిక వహించు.

కం. అరచేత ముసలమున్నన్
వరవిద్యాశాలి యగుచు వసుధనసుత భా
సుర రక్తిన్ బహుళ స్త్రీ
పరితోషణ నిరతుఁడగుచు భాగ్యయుతుఁడగున్.

కం. కనుబొమ నాసాపుటములు
కనుగవ శ్రుతులోష్ఠ చూచుకములున్ జానుల్
ఘనకూర్పర మణిబంధము
లౌనరున్ గటికర పదాండ మొగి సమమైనన్.

కం. చెక్కులు పెదవులు భుజములు
మక్కువ దంతములు జత్రుమధ్యము హెచ్చున్
దక్కువలుగాక సమమై
చక్కఁగఁ గను పట్టు రాజ సన్మాన్యుఁడగున్.

ఆ. వె. ఏకవృషణుఁడైన నిలపతియగు లంబ
వృషణుఁడైన మధ్యవిధిఁ దనర్చు
విషమ కోశుఁడైన వెస రోగ దారిద్ర్య
బాధలొంది పీడబడుచునుండు.

తే. గీ. సింహశార్దూల గజవృషస్థిర గమనత
నాయురారోగ్య భాగ్యభోగాన్వితుఁడగు
నోష్ఠ హనునాసికల నెఱుపొదవెనేని
భాగ్యవంతుండు వాఁడె శోభనము లలరు

కం. ద్వాత్రింశద్రదనములే
కత్రింశత్త్రింశదుచితగణనకలిగినన్
ధాత్రీశుఁడగున్ దత్సం
ఖ్యాత్రితయన్యూనతన్ మహాకృపణుఁడగున్.

తే. గీ. తనదు బొటవ్రేల దేహమంతయును నూఁటు
నెనిమిదైనను భూచక్రమేలఁగలఁడు
షణ్ణవతి సంఖ్య మధ్యమసరణిఁదనరు
నంతకుందక్కువైన వాఁడధముఁడగును.

సీ. పార్శ్వాంగుళీగుల్ఫపదజానుజంఘలు
కటితటస్తన నేత్రకర్ణయుగము
భుజహస్త నాశికంబులు నండకములు
సమద్వంద్వంబులునుగాళ్లు తలముగోళ్లు
కన్నులు పెదవులు గడునిగుల్లన్ జిహ్వ
రాజిత శుభవిభారక్తకములు
వక్షశ్శిరః ఫాలకుక్షి పదములు కం
ఠ శ్రోత్రనాభి పృష్ఠములు విరివి

తే.గీ. వక్త్రికరగుల్ఫ జిహ్వలు వర్తులములు
కచ చుబుక తారకా భ్రూయుగమ్మునలుపు
దంతములు నేత్రములు చాలధవళరుచులు
గలుగు వారలు శుభసౌఖ్యకలనులిలను.

కం. పిక్కలు కచదంతమ్ములు
త్వక్కున్ వ్రేల్ సూక్ష్మమైన వాఁడధిపుఁడగున్
మక్కువఁ గక్షభుజమ్ములు
నిక్కిన యాతండు ధారుణిన్ బూజ్యుఁడగున్.

కం. కనుబొమ తుదలఁ బ్రదక్షిణ
మునఁదగు సుడిగలిగెనేని మూర్ధన్యుఁడగున్
ఘనశేఖాస్పదత మృదు
త్వనిరూఢిన్ మాంసయుక్తిఁ దగు చరణమ్మున్.

తే. గీ. అమరు మధుమత్స్య మాంసగంధముల శుక్ల
మొనరెనేనియు సంతతిఁ దనరఁగాంచు
ఛత్ర చామరపద్మ కచ్ఛపధనుశ్శ
కటముకరమీన రేఖాంఘ్రికములు లెస్స.

కం. మణిబంధరేఖ నడివ్రేల్
గణుతింపఁగ నంటియున్న ఘనసిరులొందున్
క్రణుతగఖరోక్తులచే
రణితాలంకార ధృతివిరాజిత నొప్పున్.

కం. తుమ్ముకడు చప్పుడైనన్
సమ్మతి నధికాయుఃప్రాప్తి సమ్మతిఁ గాంచున్
ఇమ్మహిఁ బూరుష లక్షణ
మిమ్ముగ నీరీతి వెలయు నెంతయు నొప్పున్.

వ. ఇంక సకలైశ్వర్యమ్ములకు నాధారభూతంబగు గజలక్షణం బెఱింగించెద.

మ. గజజాతుల్ [గుణ]ముల్ మదస్థితులు జోకన్ హేతుభూతాది రు
గ్వ్రజనైదాన చికిత్సలున్ దెలియ తేవన్ మీఱఁ గాప్యాయనుం
డు జగన్మాన్య విశంపనందనుఁడు శిష్యుల్ మెచ్చఁ గావించి రీ
గజశాస్త్రంబు తదీయ గర్భ జననాథుప్రాప్తముల్ లీలలన్.

కం. పూనిక లోమక వీథా
శ్యానకలామశ గవాక్ష సైంధవ వనముల్
వ్యానర నిరనీకములున్
స్థానంబులు ద్విరదకోటి జన్మంబులకున్.

సీ. ఈయష్టవనములు నెన్ననీ దేశముల్
గిరులును గలవౌటఁ గరులు దత్త
దష్టాఖ్యలం బొల్చు నందభద్రలు మంద
మృగములు సంకీర్ణములుగను జాతు
లగు నాదిచర్యయు నంతచర్యయునాఁగ
మలనులు దిగుతు మొదలఁ దుదలను
గల లక్షణములాదిగ మఱించి నిల్చుట
యాపలించుట నీల్గుటడవి కొమ్ము

తే.గీ. గ్రుద్దుటవి పైసరంబట్టి గుఱుతు నడత
కీలు మేలును గత్తెరకాలు నులిమి
చూపు సంతతధారయు నేపుమీఱు
టంత చర్యయు నాఁగ గజాళికమరు

శా. చండత్వంబును గట్టికొమ్ము గవ విస్తారాతి నేత్రాంతముల్
దండిన్ లావగు కంఠభాగముస్ఫుటత్వక్కర్ణముల్ గోళ్లు ను
ద్దండ ప్రాభవసాహసమ్ము విపరీతంబైన చర్యల్ మహా
శుండం బేటను మండలమ్ము మద మించున్ జాతి భద్రాఖ్యమై.

కం. సిబ్బెపు మొగమున్ గమకము
నుబ్బగు వెన్నెముక కుదురు నొరపున్ సమమై
యబ్బురమగు కుంభము లా
గుబ్బగు చూపులును భద్ర కొమ్ము సయికమై.

మ. పొగరున్ గంతము త్రొక్కునన్ శిరము నొప్పున్ బృష్ఠభాగానతం
బౌగి జాతింబగలేమి యన్యకరిపై నుత్సాహితం బౌరుకుల్
తగు సత్త్వమ్ము జనమ్ము చల్లనగు వాతంబానుటల్ గల్గి సాం
పగు నా నల్ల మదంబు మందకుల మంద్యద్రాజసన్మాన్యమై.

సీ. కాలికంబమ్ము సైకము రోమములు చాల
గలచెవి గూలు గండయుగము
తోక విస్తారమ్ము తోరంపు గొమ్ములు
ప్రక్కలం గోశంబుపట్లు నుత్తు
దూరదృష్టియు స్వకీయారోహకానుకూ
ల్యము వామ దక్షిణలలితపార్శ్వ
వర్తులా వర్తముల్ వైపరీత్యములౌట
మద గుప్తమును సౌమ్యమహిత గణన

తే.గీ. మున్నతియు నొప్పు మృగజాతి కురువివేక
మమర గజముల కెల్ల నిట్లనువు మీఱు
దక్షిణోత్తరములకుం బ్రదక్షిణా ప్ర
దక్షిణమ్ముల మృగజాతి దక్క నెలమి.

చ. వెనుకటికాళ్ళ సెకిమును వెన్నునసున్నతి దీర్ఘహస్తమున్
ఘనతర శౌర్య దుర్గుణ వికాసము చక్కగ నుండు కొంటయున్
మును వెనుకల్ పదంబు క్రమమున్ దగ నబ్ధము నబ్ధమూలకుం
బెనయం బ్రకీర్ణ జాతిగల యేనుంగు మానుగం బ్రోంది మేదినిన్.

కం. ధరం ద్రింశత్సంవత్సర
పరిమితమున్ దంతవృద్ధి పాటిలు ధైర్య
స్ఫురణంబాయూర్ధ్వయము
పెరుగున్ గజములకునెల్లం జెర్మిదలిర్పన్.

చం. చటువన సీమఁ దెల్పఁ దగు భద్రసజాతిగజంబు జూచి వి
స్ఫుటమగు మంద జంతుపతిపోల్కిఁ జే మృగదంతి యొప్పు ని
న్నిటఁ దెలివొందు మిశ్రకరి నిర్మల సంగర సాహసక్రియా
నటనకు దిద్ద విక్రమ గుణంబు భరించు ధురీణ మెంతయున్.

కం. కండలు నెత్తురు లుఱలిన
గండడగదు భద్రదంతి గంభీర విదో
ద్దండాఖ్య నొప్పునది వే
దండకులోత్తమము నాల్గు దంతముల దగున్.

వ. కలివేళ భద్రమంద లపూర్వంబులైనను సంకీర్ణంబును దద్గుణ రూప చిహ్నములు మిశ్రంబై యుండువలనంగదా సంకీర్ణజాతినా దత్కాలంబున బహుళంబయ్యె మఱియును—

కం. కలుముల శెల్లి న్మెలిమి
దళశృంగారమ్ము రణవిధాన జయాప్తం
బలము శ్రేయస్కరమగు
నిల గజలక్ష్మి గల విభుని కెదురే! యెవరున్.

కం. శిరమును బూర్వోత్తరములఁ
జరణద్వయ ములు కపోల చక్షువులున్ సు
స్థిరకర్ణ మూల మేఢ్రము
లరయం జెవిక్రింది దిన్నె లష్ట మదమ్ముల్.

కం. శీకర సాగరసిక్తక
ప్రాకట లప మేఘ మధు విభాకుండల గం
ధాక్రమాఖ్యల మదములు
శ్రీకరకర్యంగములఁ బ్రసిద్ధిఁ వహించున్.

సీ. శిరమెత్తరము మోము సిబ్బెంబు బిగువును
గాలి కంబంబుల మేలికుదురు
కొమ్ముతోరంబును గొమ్ముగో కుదిలంబు
వెన్ను విస్తారంబు కన్ను దెలివి
నిడుఁదతుండమ్మును వెడఁద వాలమ్మును
వలఁ గొనసుళ్లచే వలపలి దెస
యప్రదక్షిణపు సుళ్లనువగు వామభా
గంబును గఠినదంతంబులు దగ

తే.గీ. సమరునది రాజరాజార్హమైనగజము
భద్రమాతంగ మదియె శోభన కరంబు
చతురకరి గల్గుకంటె నైశ్వర్యమెద్ది
మేలిమిగలట్టి ధారుణీ పాలురకును.

వ. శాలిహోత్రగర్గ్య శ్రీశ్రుత నైషధ, గణ, మానప్రియ, అతికాంత రాజకాఖ్యలంగల శాస్త్రంబులెనిమిదియును గజరోగనిదాన హేతుభావ చికిత్సలు వక్కాణించు నందు జ్వరంబులు గజజాతికిఁ బాకలంబులును దురంగమ్ములకు వేధలును నగు నట్టి పాకల దశకంబును ద్వాత్రింశత్పాదరోగంబులును శూలకుక్కుటాది సప్తవాహనంబులును ద్వాదశ శోభలు, శాల్మలీకదళీ తండులంబులను జతుర్వింశతి నేత్రరోగంబులునుంగలవు గుణచర్య దృష్టకర్మంబుల వలన నే తద్వ్యపరోగంబు నెఱింగి తదుచిత చికిత్స లొనర్ప వలయుఁ బాకలంబుల యందసాధ్య బాహుళ్యంబగు నిది గజలక్షణం బింక నుష్ట్రజాతి భేదంబు లెఱింగించెద—

ఆ. వె. ద్విఖురి చక్రవాళి ధృతినొప్పునందున
త్యధికధార సతతమసురు ముదము
తలకు కేశపంక్తి కుఱుచయౌ మెడ మేటి
బరువు మోచు ద్విఖురి తెలుఁగు నెరయ

కం. బటువగు గొరిశల పాదవున్
పటుమదము వసంత వేళఁ బ్రబలఁగ నాలోనై
ల్లటుఁ దనరు నల్పధారలఁ
జటులగతిన్ జక్రవాళి సరణిఁ దలంచున్.

చం. పశువులకైన రోగముల భంగియె
యుష్ట్రకులాళియమ్మ త
ద్దశలరు కింశు కప్రసవదండము
నెల్గుల రక్తముల్ గలిన్
లశునము రాతియుప్పును బలం
బొనఁగూర్చుఁ జికిత్స నేయుచో
విశద వివేకరుక్ప్రథిత
విశ్రుత బుద్ధుల సిద్ధ చర్యలన్.

వ. ఇంక నశ్వలక్షణం బెఱింగించెద—

కం. ఆవర్త...వరూ
భావ చ్ఛాయాగతి ప్రభావసుగుణ శో
భావహలక్షణ రుగో
పావళిఁ దెలియంగవలయు నశ్వములందున్!

ఉ. కందము మందముల్ గుదురు గల్గినరంధ్రములు సూక్ష్మకర్ణముల్
కందువలందుమేల్ సుడులు కాయపు నిద్దము ముద్దుమోము నీ
టందపు వాలమున్నత మహాజవముల్ శిరసెత్తెడంబు సొం
పొందు గుణమ్ములుంగలుగు నుజ్జ్వలవాజియె లక్ష్మియెన్నఁగన్ !

మ. అనిలో గాయముదాఁకి ప్రేవుగమి జీరాడన్ వడిన్ రౌతు నిం
టనిచున్ నైజబలంబుడంబమర వాటంబొప్పఁదచ్చిహ్నముల్
గన రెచ్చున్ బయనమ్మునం జడియ కేకప్రక్రియంబొల్చు నెం
దనుమానించదు సత్త్వమాశ్వ గుణమీయందమ్ములింపొందఁగన్ !

కం. అనికిన్ వేఁటకు వేడుక
కును వాహన మెద్దియేని గుఱ్ఱముబోల్పన్
జనునే! బహు గజములుగల
మనుజేశుండశ్వవిభుని మాడ్కిం జనునే !

కం. కలననెడి జలధిలోపల
నలవగు సైంధవము మందరాద్రిగ నరులన్
గలఁచిమథింపకయాఁటక
కలుగునె! జయలక్ష్మి శౌర్యకలితుల కెందున్ !

సీ. విదితమ్ముగా నూట పదిసుళ్లు గలవు
తురంగమంబులకుఁదత్క్రమము తెలిపి
దగు విధంబులనుండు నావర్తమనియెడి
సుడిగతి ముకుళమ్ము సొంపుగుమల్లె
మొగ్గచందము జెట్టి మురువున శతపాది
పాదుకార్థము ఖండభాగరీతి
చిప్పమాడ్కిని శుక్తి యొప్పగు పదభాగ
కొమ్ముగ్రూపమున మూకుడు విధమున

తే.గీ. తగు సమూహాయవ విధము దూడనాకుడు
కరణి నిట్టి గుఱుతు గల్గుసుళ్ళు
దనరు నిట్లు సుడుల స్థానఫలమ్ములు
దోషములు నెఱుంగదొడరు శుభము

ఆ.వె. మూఁడు పదులమీఁద మొనయంగ ఋషిసంఖ్య
సుళ్లు శుద్ధములు విశుద్ధలీల
నబ్బుకీఁడు సుళ్లు డెబ్బదియాఱని
వాఁటిఫలములునికి వడువు వినుడు !

కం. శతపాది శుక్తిపాటిక
మితముల రెండంగుళముల మితిఁ ద్ర్యంగుళ సం
గతి యవవిధి పాదాంగుళ
మితి ముకుళము మూహ యెనిమిది యంగుళముల్ !

కల. ఆవర్తపాదుకార్ధము
లావాజుల తనువుకొలఁది కనువై యుండున్
రావులు కొలఁదులుదప్పిన
చో విదిత ఫలమ్ములొసఁగ జూడవు సుమ్మీ !

డం. శిరమున నుదుటం బ్రక్కల
నురమున రంధ్రమునఁ దగు తదుపరిస్థాన
స్థిరిత దశ ధ్రువముల నా
సురుచిరముగఁ గల్గు వాజి శుభములొసంగున్ !

కం. నరనారాయణ గుహయ
తురాతుసమరుత్తులు రవిశశివహ్నులు నన్
మరుఁడు నధిదైవతములు
ర్వరఁ దేజికిఁ గలదశ ధ్రువములకు నరుసన్ !

మ. సరిమస్తమ్ములు లేనివాజుల కరస్పర్శమ్మునుం జేయ రా
దరయన్ స్థానములందు లేనిరొండ లాయంబెల్ల శూన్యంబుగా
నెరయన్ వర్తిలు రావులంగలుగ నెన్నేయేండ్లు వర్ధిల్లు సు
స్థిర సౌఖ్య ప్రదమౌ ధ్రువంబు లెడయన్ శ్రీ పాయు తద్భర్తకున్ !

కం. హీనాధిక్యములైనన్
స్థానమ్మున లేమి ధ్రువలు జనియింపమియున్
వానిం గనుగొనదోషం
బానికపది ధ్రువలు లేని యశ్వముకొఱయే !

సీ. నెలవులయందునఁ జికురంబు నెడ నోఁటు
రెండేసి యొక్కెడ నుండు మూడు
నొసల నాలుగు సాది నుతి నున్నతంబగు
భాగమ్ములను నుళ్ళు పదియు రెండు
కంఠనిగాళముల్ కరయుగమ్మున నాల్గు
కచహాను పదనసంగతుల మఱియు
నెనిమిది పూర్వోక్తమీ సంఖ్య స్వస్థాన
ముల నున్కి సంపదల్ గలిగి వెలయు

తే.గీ. నెలవు మఱి దేవమణియున్న నెరయ శుభము
పరఁగఁ గంఠాభరణము శోభనములిచ్చు
నివి గలుగు గుఱ్ఱముల నెక్క నవనియేలు
గళమునఁ శక్తి నుడియున్నఁ గలుగు శుభము !

కం. సకలైశ్వర్యమ్ములు న
త్యకళంకయశమ్ము నిచ్చు నవి గళసీమన్
బ్రకటముగఁ గల్గ నదిన
మ్మకు కంఠాభరణ దేవమణులెడయైనన్ !

కం. గళమునను దేవమణి తగఁ
గల గుఱ్ఱము నెక్కి యింద్రు కరణిన్ మెఱయున్
వెలయఁగ నదిముందరిదెసఁ
గలిగిన రిపుజయము గాంచు గను సౌఖ్యంబుల్

చం. నెలవుల రెండు సుళ్లు గల సింధుజ మిష్టములిచ్చు రంధ్రసీ
మల నల మేఘరీతి నుడి మానుగ మేలిమి నాఁదనర్చు న
ట్లలవడు వాజినెక్కి మణిహైమవిభూషణముల్ ధరించు గూ
బల వృషభాఖ్య సుళ్లనికి పట్టుగఁ గుండల ధారణుండగున్ !

సీ. నాలుగు మూలల నాలుగు సుళ్లౌన
నంబునఁ జతురంతికంబనఁ దగు
వక్షస్స్థలమున శ్రీవత్సకి యదిగల
సైంధవంబైశ్వర్య జయములొసఁగు
రీతి మూలల మూఁడు త్రేతాగ్ని యది ముఖ
మున నుస్కి రాజ్యాది ఘనతఁబొసఁగు
నెఱి మూఁడు దొంతరనిశ్రేణి రాజ్యప్రదమ్ము
స్థామ్మునవైనఁదనరు సుఖము !

తే. యమళమన రెండు సుళ్లు జయప్రదమ్ము
భుజములనుమూఁడుఁ సుళ్లున్న భూషణములు
గలిగి వర్ధిల్లు లక్షణ గరిమ లెఱిఁగి
మేలివాజుల నెక్కిన మేలుగలుగు !

వ. మఱియుఁ బ్రసాద చిత్రతోరణ ధను శ్శ్రీ సరసీరుహ వేదిక స్వస్తిక త్రేతాగ్ని యమళ నిశ్రేణిక చతురంతిక గదా చక్ర కలశ లాంగూల శక్తి ఖర్జూర ఖండేందు వజ్రాయుధ అంకుశధ్వజ రథ అశ్వత్థదళ సూర్య అష్టపద అండజ పాంచజన్య

భావంబులను ధ్రువములుంగల తురంగంబుల నేలిన నృపతికి శత్రు జయంబును తద్రాజ్య లాభంబును గలుగు నింక దోష మహాదోషములగు నావర్తంబు లెఱింగించెద—

చం. గళమున శంఖదేశమునఁ గన్నుల ప్రేవల జంఘ లందుర
స్థ్సలమునఁ గిందుసందులను జానువులన్ గకుదంబునందుఁ బ్ర
క్కలఁ గటిదంతవాలముల గల్గిన సుళ్లఁ దురంగమంబు ని
చ్చలు నొదవించు రౌతున కసంఖ్యములైన యరిష్టసంతతుల్

తే. కక్షమున వెన్ను దెస నాసికాపుటముల
నాభి ప్రాంతమ్మున వృషణముల జబ్బ
ల యెడ రెండేసి సుళ్లున్న హయముఁ జేరి
యంటి గ్రుంకిడి రవిఁజూచు టర్హమరయ !

కం. ఇవి దోషపు సుళ్లనఁదగు
నవిరళముగ మూఁడు నాల్గు నయ్యెయెడలన్
వివరముగ సుళ్లు గలిగిన
నవియె మహాదోషసంజ్ఞ లశ్వమ్ములకున్

వ. ఇంకను వర్ణ జాతి రోగ నిదాన చికిత్సాక్రమంబు లెఱింగించెద—

కం. నేలం గొరిసెలఁ గొట్టుచు
మేలిమి బంగారుచాయ మేనున గమనో
ల్లోల శిరశ్చలనాశ్వము
హాళిన్ ద్విజకులము గత్తెరనఁ గలిమొసఁగున్ !

కం. మొకమున బిగువు జపాకిన్
శుక దాడిమబంధుజీవ సుమరుచియు ధృత
ప్రకటిత జడియమి రాట్కుల
మకుటిల మది పూజకర్హ మగు తేజి ధరన్ !

తే. శక్రకోదండ పద్మకింజల్కశుక్లవర్ణ
మది వైశ్యకులమగు వాజి దాని
నెక్కునాతఁడు నిలయెల్ల నేలు యశు
విభుఁడు సాధనవంతుఁడౌ విశ్రుతేముగ !

కం. హరిమణికోకిల షట్పద
సురుచిర వర్ణములఁ గలిగి శోభనవేగ
స్ఫురణన్ ధాన్యప్రదమై
కరమొప్పగు శూద్రజాతిగల యశ్వంబున్ !

ఉ. మంగళ నీలజంబుగరిమం దగు గత్తళి బోరబొల్లి సా
రంగియుఁ జారి యుత్తరజరత్తియు గండియుఁ బంచభద్రయున్
బింగళ బిబ్బ జయ్యఁడనఁ బేర్మి విధుం డళిజాతి నాఁగ ధా
త్రిం గల వర్ణసంజ్ఞలను దేజులకుం దగు నామధేయముల్.

తే. పంచకల్యాణి యనఁ దగు పాదవదన
పాండురంబును కర్ణముల్ వాలవక్ష
ములు నవియుఁ దెల్పు నష్టమంగళి యనఁ దగు
నచ్చమగు తేజి బోర నా నతిశయిల్లు.

కం. ద్విజకులము కాచారము
రాజునకున్ మహము ధేను రాజికిఁ బాలున్
వాజికి వేగము ముఖ్యం
బోజన్ వేఱు గుణమేల నూహింపంగన్.

ఆ.వె. అల్పమూల్యలబ్ధ మాజి లబ్ధంబును
జోరలబ్ధ మైనచోఁ దురగము
లక్షణమ్ము లివి నిరీక్షింపఁ బనిలేదు
సొంపు మీఱ సంగ్రహింప వలయు.

చం. శనగలు దిన్నచోఁ గయిపు. సల్పిన చోట జలమ్ము నార్చుచో
ననువుగఁ గింకిణుల్ గళము నందిడుచో నుపచార వృత్తిచో
ఘనముగ నేర్పరెక్కునెడఁ గల్గు హయాళికి సంతసంబు నె
మ్మనమున నుబ్బునుం బలిమి మానిత ధైర్య సమగ్ర వైఖరుల్.

కం. క్షతరోగ లోహబంధన
తతరణ ఝఝటి నినాదతన్ వహ్నిజలా
ద్భుత మృతదశలను నురుధీ
రత లల యశ్వముల ధైర్య రహినిం దనరున్.

తే. దురమునకు నేర్పెమియుఁ గఱచుటయును
గందమట నర్పళించినఁ గదలమియును
తఱటుచేఁ గొట్ట నురకమి తన్నుటయును
గంగ తుఖ్ఖతురంగ మాఖ్యను బొసంగు.

కం. వెల్లుల్లి జయాజ వాకుడు
వెల్లగు మిరియాలు శొంఠి పృథుమాగధులం
దెల్లీలఁ గూర్చి కవణం
బల్లన నిడ వాతరోగమది మాను తగన్.

కం. నరులకు నాడియు గజముల
కరయఁగఁ దగుగతి విశేష మశ్వమ్ములకున్
బరికింప నేత్ర వర్ణము
లిరవగు రోగములఁ దెలియ నివిలక్షణముల్.

ఉ. కన్నులు పద్మపత్రముల కైవడినుండిన స్వస్థదేహముల్
ఎన్నఁగ నల్పు మించునెడ నెంతయు వాతము మాదియేకురీ
తిన్నెర పల్పనౌ తెలుపు దేలిన శ్లేష్మము పైఁడి ఛాయదై
యున్నది పైత్యమైది తగ నున్నదియుం దగు మిశ్రరోగమై.

సీ. కన్నీరు బిందువుల్ గా నేత్రముల నునిక
జ్వరము తత్తద్వర్ణ సంగతముగ
నలుపాకు పసరును [నలి?] హరిద్రాచ్ఛాయ
యగు గచ్చకాయ యొప్పందముదగు
తెలుపు ఛాయయును గాజులరుచి ముక్తి
కోజ్జ్వలము శంఖో లూక విలసనంబు
కన్నులఁ గను పట్టియున్న గుల్లింబున
కాయాపు నిర్ణయ మరయ వరుస

ఆ.వె. నెనిమదియును ౭ెయునేండ్లు పద్నాలుగు
పదియునేఁడు రెండుపదులు నిరు
దియును మూఁడు నిరువదియునాలును బది
తొమ్మిదేండ్లు దెలియఁ డిమ్ముగాఁగ.

సీ. గుండు గుల్లములైదు గోడిగ నొక్కటి
ప్రాఙ్ముఖంబున నిల్పి రహినిషోడ
శోపచారమ్ముల నేపునఁ బూజించి
యుల్లియఁ బసపు నయ్యుత్తరేణు
విత్తులు వసయును వేపాకు జీరక
తంపుల ప్రీహులత్తటిని మూట
గా గళమునను రక్షాబంధనము సేయు
టనువు మహాశనవమిని నొనర్ప

తే.గీ. నారవుతు నెల్ల సౌఖ్యమ్ముల ననుభవించు
రోగములఁ బాసి తురగముల్ రూఢిఁ దనరు
మఱియు దశవిధ ధాన్య పెఱూమములు సూర్య
తనయు రేవంతు ప్రార్థనల్ తగవు మిగుల.

శ్లో. నమో దేవాది దేవాయ
తురంగాణాం హితాయచ
సూర్య పుత్రాయ దేవా య
రేవంతాయ నమోనమః

సీ. రేఁపున బగఁటను మాపొద్దు శస్త్రింబు
కొమ్ము జలూకంబు కొని రుధిరము
నశ్వంబులకు రోగ మరసి తీయఁగ నర్హ
మదిరయొండు పది ద్వాదశాంగుళములు
పాడవునఁ గలరక్త నదరి వెల్వడుటన
శ్వాక్షములకుఁ గ్రవ మబ్ధిఫేన
గంధమణుల్ నింబ ఘనలికుచరసము
లవి తేనెతోఁ గుక్కుటాండ యుక్తిఁ
జెలఁగఁ బిప్పళ్లు మృదువుగా నెలమినూరి
కలిక మిడినంత నక్షిరోగములు మాను
సరవి నెత్తురు దీసి రసమ్మునిడ్డ
గంతు లడఁగు దురంగమగణములకును.

కం. రసములకును దంగేడా
కసములఁ గట్టినను మాను నడఁగమి నవిచిం
చిసరగ నుప్పదిమినచో
పొసఁగన్ లఘు వగుచుఁ బాదములు చెలనలరున్.

చం. తనువునఁ గంతులున్న విదితంబుగ దోషపు వేఁకి దాఁకినన్
బెనుపగు తిప్పతీగె సగిలిండియునున్ గొతిమర్లు చంచుమూ
లనియతి జీరతైలములు లాలితరీతి లవంగయుక్తిమై
మనుపడఁ బాలతోఁ గలయ బాగుగ నూరి యొసంగ మేలగున్.

తే. చల్లనగు మేనుతప్తమున్ జ్వరము నాము
దంపువేళ్లను పల్లెరు గుంపువేళ్లు
పటుకషాయమ్ము మూఁడవపాలుజిక్క
కాచియిడ నస్యమొనరింపఁ గదలుజ్వరము.

తే. శొంఠిపిప్పలి వసయును జూర్ణముగను
జేసి తొల్తఁ గషాయమ్ము పోసియిడిన
సరగ విడుచును దప్తమౌ జ్వరము మఱియు
నరచికిత్సలు విహితంబు తురగములకు.

కం. తనుపత్యుష్ణత సంతా
పనిరూఢజ్వరము గళముపట్టఁ గురకుర
ధ్వనులకును దోసకాయయుఁ
బనుపడఁ గొతిమర్లనరఁటి పండ్లిడమానున్.

వ. ఇంక రత్నలక్షణం బెఱింగించెద—

గీ. కెంపు వజ్రంబు ముత్తెంబు సొంపు మరక
తంబు వైడూర్య పుష్యరాగంబు లింద్ర
నీల విద్రుమ గోమేధికాళి పగ న
వగ్రహాధిపరత్ననవక మెలమిని.

సీ. వెలలేని మణి కురువిందము లివి రెండు
భంగులా కురువింద పద్మరాగ
మాంస గంధియుఁ గెంపు మఱియు సౌగంధికం
బనునందు నుదయార్క పటిమ దీప్తి
పద్మరాగము పిక ప్రకటాక్ష రుచి
కురువిందంబు దాడిమ విరి మెఱుఁగున
కురువింద మతిరక్తతర మాంసఖండంబు
బలె మాంసగంధియు నలుపు నెఱుపు

ఆ.వె. గలుగు నిగ్గు నీలగంధి వీక్షింపఁ గ
లాలు లేఁత కోమలములుగాఁగ
సొరిది కెంపునది యశోకకింశుకలోధ్ర
సమవిభాతిఁ దనర నమరు మేలు.

తే. పేర్మి లశునత్రాస భిన్నముల్ పటలంబు
జర్ఝరంబు కర్కశమును నీల
మనఁగ దోష షట్కముగు కెంపుజాతికి
వేయు వేల వాటి విస్తరింతు.

కం. పాలుపయిఁ బోయఁ గనుపడు
డాలది లశునంబు సిరుల డంబడఁగించున్
లీలన్ బగిలినగతి రే
ఖాలక్ష్యము త్రాసమగుట కలహంబు శైయున్.

ఆ.వె. తునిఁగి పోయినట్లు తోఁచుట భిన్నంబు
బంధువైర కార్య పరిణతిఁదగు
ఛిద్రమపలైన రీతిచేఁ బటలంబది
శోకకారణమ్ము ప్రాకటముగ.

కం. పొరలున్న జర్ఝరంబగు
నెరయఁగఁ గర్కశమునగును నెరి సంకటమై
నెర నైల్యము నీలమ్మగు
పరువడి వెలుపకును దిగుడుపాటగు నెందున్.

కం. నున్నయగు మీఁదబిందువు
లున్నన్ జూడంగదోష మొదవుం దానన్
వన్నెదగు పద్మరాగం
బన్నది వెలకెచ్చు సూర్యుఁ డధిపత మొసఁగున్.

సీ. హిమ మతంగమ్ముల నిలబుట్టు గృతమున
కాశ్మీర కోసల ఘనవిశాల
ములఁ బుట్టు త్రేతను వెలయంగఁ బాండ్యసౌ
రాష్ట్ర భూముల ద్వాపరంబునందు
హేరాగ దేశ విహార భూములయందుఁ
గలికాలమునఁ బుట్టు నెలమివజ్ర
మణులు డాఁకటఁ బెట్టి గణన సంబెటను
వేసిన తగ్గకయూ విరిసియును బోక

తే.గీ. బెడిసియంతటఁ బడునది బిరుదువజ్ర
మదిపురుష రత్నజాతిశై యతిశోయిల్లు
శుక్రుఁ డధిదైవతముగాన శుభములొసఁగు
ననఘ మగునేని రాజ భూపార్హ మగును.

కం. మల్లె విరిచాయ ద్విజకుల
మల్లనఁ బల్లవము చాయనగు రాట్కులమున్
మొల్లపుఁ బసిమిన్ [వైశ్యము]
మొల్లన నలుపైనశూద్ర మిత్తెఱఁగమరున్.

తే. పరగు సుకృతమ్ము కలిమియుఁ బాపహరణ
విభవములు గల్గు పరుసతో వీటిఁ దాల్ప
నాలుమూలలఁ గొనియు రెండైనధార
లమరుఁ జుక్కనగల వజ్రమదియె మేటి.

సీ. నడుమ నల్లనిరేఖ లడరఁగా కపటమ్ము
దాఁచినవాఁడు నిర్ధనికుఁడగును
వింతచాయలు గల్గ విచ్ఛాయ నిజఛాయ
తెనిమిది మలినమ్ము లీనకోణ
ధారలు లేనివి తగ ముండనంబగు
జరగు దోషములు వజ్రముల నిట్లు
శుద్ధవజ్రము దాల్ప శత్రుఁడు పరిమిచ్చు
వినుము త్తెములు దశవిధములరయ

తే. జలదజమ్ములు నిర్ఝరసమితి దాల్చు
పాముతల యెడ గురుగింజ భాతి విషహా
రంబునగు కీచకజము తారకముభాతి
దాల్ప శ్రీవశ్యకము శుభదంబునగును.

ఆ.వె. గండుమీలఁ గలది వెండి మల్లియచాయ
లడరు దాల్పనగ్ని యంటు దెందు
నిలను జెలుకువలన వెలయు ముత్తెమ్ము శ్రీ
రాజవశ్యకము ధరాతలమున.

కం. కిటిదంత సంభవంబది
శటు భూపార్థ్యమ్ము రేగుపంటి గతిఁ దగుఁ
స్ఫుటతామ్రకర్ణి సింగళ
నటరావణ శుక్తి మౌక్తికావళు లెలమిఁ.

ఆ.వె. తామ్రపర్ణిఁ దక్క దక్కిన వరుదాకుం
ఖనిఁదలంప మఱియుఁ జినుకు లెంత
నొల్లు శుక్తిఁబడిన నట్లన నంతేసి
మౌక్తికములు పుట్టు మహితగతిని.

కం. కెంజాయ సింగళమ్మున
రంజిలు బంగారువన్నె రావణమున ని
ట్లుంజను సురాక మాఱియు
మంజుల పాఱియును ద్రివిధ మౌక్తికజాతుల్.

తే. తనరుఁ ద్వ్యస్రశంబు పార్శ్వకుంతనము కాక
పాణిస్ఫుట కంబు శుక్తికాస్పర్శనంబు
నరయ నతిరక్త మత్స్యాక్షులనఁగ జా[x]
డంబు ధూమాంకమనఁగ దోషంబు లమరు.

కం. గోమూత్రములోఁ బడనిడ
నామిక దేలినది లెస్సయట మునిఁగినచో
నాముత్తెము కృత్రిమమగు
శ్రీమహిమం దాల్ప విభుఁడు నేమము లొసఁగుజ్.

సీ. పాలపక్షి గఱుత్తు బాగు నెమలి పురి
యందము గాజు పెంచెందగురుచి
యలపూర్వముల వన్నె జలు రక్తసపువిరి
సుహితదీప్తియుఁ బాలు మానికొమ్ము
చిలుక ఱెక్కల జిగి నలశిరీషప్రసవ
రుచులఁ జెలువంది మరకతములు
కెంపు లక్షణము లీ సొంపున నన్నియు
బుధుఁడిచ్చు ఫలము లెప్పుడును దాల్ప

తే.గీ. దృష్టిదోషమ్ము విషములు దీఱుదావ
వర్ణవిధములు దక్కఁగ నిర్ణయములు
తెలియఁదగు కురువింద జాతికిని బలెను
నీలలక్షణ మెంతెఁగింతు లీలవినుఁడు.

కం. నెరరంగు నింద్రనీలం
బరయఁగ ధర దొరకదెందు నమరపురిఁదగుజ్
నెరి ముప్పాతిక రంగునఁ
బొరి నీలము నెన్న వెదురుఁబూరుచి దనరుజ్.

సీ. అది మహానీలమౌ నఱరంగు నీలమ్ము
గుఱుతు విష్ణుక్రాంతకుసుమ భాతి
నిలఁదాస భిన్నపటల శిలాగర్భ మృ
ద్గర్భ శోణిత బిందుగతులు గలుగు
టలు మహాదోషముల్ మలినంబు విచ్ఛాయ
కుక్షికురంజి నెక్కొనిన వాలు
కాస్పర్శనములు నాఁ గలవు సామాన్య దో
షంబులు త్రాసజర్జరితముఖ్య

తే. రీతులా కెంపు నెఱిఁగిన భాతి నెరయ
పలయుఁ బరిశుద్ధ నీలమ్ము నెలమిఁదాల్ప
శని ఫలప్రదుఁడగుచు నిచ్చలును బ్రోచుఁ
గీఁడుఁ దొలఁగించి సొంతయు వేడుకలర.

కం. గోమూత్ర కాంతి సమరుఙ్
గోమేధిక రత్నవరయ గురువిషహరమై
భూమిదుఁడు కేతు వెప్పుడు
శ్రీమహిమం బొల్చునట్టి శిష్యుల కెల్లన్.

తే. పుష్యరాగమ్ము బంగారు పొలుపు దనరు
నదియు వైడూర్యమును దాల్ప నధిక శుభము
లిచ్చు రాహువు మిక్కిలి మచ్చికలర
విద్రుమంబునఁ గుజుఁడిచ్చు విభవ మెలమి.

కం. అది మణిపంటి చాయన్
బదపడి యలచంద్రుని ప్పు బాగునఁ దనరున్
విదితము గా నవరత్నము
లదనం దెలియంగ నిట్టి పగు గతులమరున్.

వ. అని సకల వ్యవహారంబులకు నాధారంబగు గణిత శాస్త్రిం బెఱింగించెద న
సూతుండు శౌనకాది మునుల కిట్లనియె——

కం. గణితములు పదివిధమ్ములు
ప్రణుత స్థిత్యష్టసంఖ్య పరికర్మములన్
గణుతించి వేఱువేఱగు
ఫణితిన్ సంక్షేపరీతిఁ బలికెదఁ దెలియన్.

సీ. సంజ్ఞయుఁ బరికర్మ సరణి భిన్నాధికా
రము ప్రకీర్ణమ్ము త్రైరాశికము,
సూత్రంబు క్షేత్ర మచ్చుగ ఖాత గణితంబు
కరణసంస్థితి చాయ గడఁగు పదియు
ప్రబలత గుణకార భాగహారమ్ములు
లల పగు వర్గ మూలములు ఘనము
ఘనమూల మమర సంకలిత ముత్కలితంబు
లను పరికర్మంబు లతిశయిల్లు

ఆ.వె. నందు మొదటిదైన యట్టి సంజ్ఞయెఱుంగ
కెఱుఁగఁ గూడలేమి యిరవుగాఁగ
భూమి కాల ధాన్య హేమ తులా క్రమ
మెఱుఁగఁ బల్కెదిపుడు వరుసగాఁగ.

కం. పరమాణు వాది యష్టా
ష్ట రుచిర వారాభివృద్ధిఁ జను నంగుళమై
నెరి నవి జానెడు పంద్రెం
డరయఁగఁ బదియాఱు జాన లవి దండమగున్.

తే. దండములు వేయి క్రోశమై తనరు నాల్గు
క్రోశములు యోజనము నేల కొలఁత నిడివి
వెడలుపాక కోల గుంటె డాకడఁక నిరువ
దేను గుంటెడు తూమెడు మాన మిట్లు.

కం. నిమిషమ్ములు పదునేనిమిది
యమరంగాఁ గాష్ఠ కాష్ఠలగు కళ త్రిదశ
క్రమమున నవి యాఱొకఘటి
క మెఱియు దివసాబ్దముఖ్యగతులగు దానన్.

సీ. ధర నవశతసంఖ్య ధాన్యమ్ము సోలెడు
మానెడౌ నవి నాల్గుమానికె లన్ని
కుంచెడు నాలుగు కుంచముల్ తూమెడు
నవి యిరువది పుట్టెడనఁగఁబరగు
నాలుగు వడ్లెత్తు లీలతో నొకగుంజ
యవినాల్గు మాక యెత్తవియు నాల్గు
ధరణమ్ము రెండవి తగ గద్దె గద్దెలు
పదియాఱు గూర్చిన పలము పలము

తే.గీ. లిరువదొక వీసె యవి నూఱు బరగ బారు
వరయ నేకాంగుళాకృతి యంత జలము
లిల వరాయెత్తు షట్పలమ్ములును బాద
భాగమొక కుంచెడిది జలభావ మరయ.

ఉ. వన్నియ తెన్నొ తద్గణన వర్ధనసేయుచుఁ గూర్చియెత్తు న
వ్వన్నెలయట్లు నింతని ధ్రువంబొనరింపుచుఁ దాన వన్నెఁబా
ల్గాన్నను వన్నెయౌ పయిఁడి కోరి పుటంబిడి నందునన్ బదో
వన్నియ కుందనం బొకటి వన్నియ వెండి విమర్శనస్థితిన్.

క. కానులు నాలుగు వీసము
మానక నవి పదియు నాఱు మహిఁజిన్నె మగున్
పూనిక నేకదశస్థా
నానీకము దశగుణోత్తరాధిక్య మగున్.

వ. ఇవి సంజ్ఞా ప్రకరణమ్ము నయియవి యింక సకల పదార్థపరికర్మంబున యవి వినుండు—

కం. ఏకోత్తర వృద్ధిన్ బది
దాకా లెక్కలిడి కూడఁ దగు నేఁబది యై
దీకరణి రెంటి లెక్కలఁ
గైకొని యనుమడగునట్టి క్రమ మెఱుఁగుటలన్.

ఉ. పెక్కగు లెక్కలిట్టివియె పేర్కొఁదగన్ గుణితక్రియార్థమై
యొక్కవ తక్కువన్ సుళువు లిట్లిడ నిట్లగునన్ విధంబులున్
దక్కక నెందు కందు వెసఁదార్కొనఁగా సమకొల్పు రీతు ల
ట్లక్కజమైన రెండపదియౌ పరికర్మ మనేకభంగులన్.

శా. కొన్నిన్ బుద్ధిని గొన్నిఁటిన్ గుణకసంగుప్తమ్మునన్ దంత ని
ష్పన్నార్థి గ్రహణాధి కారముల నెచ్చన్ గొన్ని మధ్యార్థతన్
గొన్నిన్ సంకలితోక్తి వర్గగతి గీ ల్కొన్నింటినిన్ బ్రశ్నలన్
జెన్నొందన్ వివరించి తేటఁపఱుపన్ భిన్నాధికారమ్మగున్.

కం. నిర్ణయమునకై తత్త
ద్వర్ణత నొనఁగూర్చి యొందు వైఖరి దానిం
బూర్ణము చేయుట లవియె ప్ర
కీర్ణకమను పరికరంబు కీర్తితమయ్యెన్.

తే. రమణఁ ద్రైరాశికము పంచరాశికమ్ము
సప్తరాశిక మనఁగల సంఖ్యలయెడ
భాగముల నిర్ణయించు శోభనవిధమ్ము
దనరుఁ ద్రైరాశికమ్మునా వినుతికెక్కె.

కం. చిత్రములు భాగవిధములు
పాత్రార్థ వివేకసిద్ధి పటిమయుఁ దగఁ ద
త్సూత్రమునఁ గాక వేఱొక
సూత్రము వివరింప కునికి సూత్రంబయ్యెన్.

కం. రీతిఁ గొలయచ్చు కట్టుల
చేతను గుంటలు ఘటింప క్షేత్రగణితమా
ఖాతపు మట్టును విరివియు
జ్ఞాతిన్వివరింప ఖాతసంజ్ఞదనర్చున్

ఉ. చుట్టును గొల్చు కోలలవి చూచుక పాతికపాలు గూర్చియా
దిట్టమె గుంట కెన్నఁదగు లేకువతో వలయింపఁ జేలకున్
పట్టుక తక్కువాటికినిఁ బట్టి ప్రతిక్రమ సంఖ్య లక్ష్మమా
గుట్టుగఁ గోల యిన్నడియె గుంట చతుర్గుణ మెన్నికందగున్.

సీ. బారకు బార యేర్పఱచు లోతు వెడల్పు
నిండు మట్టైనచో నిండుగుంట
యరయఁ బాతిక మట్టులైనసట్లగు సంఖ్య
నిడివి వెడల్పును నిండలేక
నఱయైనచోనది...నిండు మట్టి
పాతికకుంటయై పరిధ విల్లు
త్రవ్విన మట్టియంతయుఁ బొడవు వెడల్పు
కొలగని గుంటల కొలఁది దెలియ

తే.గీ. వలయ పనికి నటులఁ గొలఁత వెంబడినట్టు
క్రమత భంజ కమ్మలమరఁ జేసి
పరకపాలు పెంచి పాటించి కూడినఁ
గణన సమము వచ్చు గణికులకును

కం. ఛాయాప్రమాణ గణనన్
బాయక లెక్కించి బింబపటునిర్ణయమున్
జేయుటలవి యెన్నంగా
ఛాయాపరికర్మమనఁగ సభల నొప్పలయున్

వ. గుణక క్రమంబు దశమపరికర్మంబగు నది యెనిమిది తెఱంగుల గుణకార భాగహార వర్గ మూలఘన ఘనమూల సంకలితవ్యత్కలితంబులను దత్తదుచిత కృత్యంబులకు హిత మగు నేక దశ శత సహస్ర దశసహస్రలక్ష దశలక్ష కోటి దశకోటి శతకోటి అర్బుద న్యర్బుద ఖర్వ మహాఖర్వ పద్మ మహాపద్మ క్షోణి మహాక్షోణి శంఖ మహాశంఖ క్షితి మహాక్షితి భూరి మహాభూరి అంత్య అతర్క్య అప్రమేయ సముద్ర సాగరా నంతంబులను ద్వాత్రింశత్స్థానంబుల నమరె నిది గణిత ప్రకరణంబిక షష్ఠచికిత్సాక్రమంబెఱింగించెద.

చం. కమలభవుండు మున్ సురభి క్రమసుధారస మాదరంబుతో
నమరుల కిచ్చి భూప్రజకు హవ్యము గవ్యము చేకురన్ దయా
క్రమమున ధేను సంతతులఁ గల్గఁగఁ జేసెఁ దదీయరక్షణ
త్వము లతి ధర్మ మెవ్వరికిఁ ధాత్రిఁ బవిత్ర చరిత్ర సంపదన్.

కం. విహితంబుగ ధన్వంతరి
సహదేవుఁడు పచ్చికిత్స శాస్త్రోక్తత స
న్నిహిత మొనర్చిరి జగతిన్
వహిఁ దద్విధ మిపుడు వినుఁడు వైఖరి నెరయన్.

ఆ.వె. నెమరు బెట్టదూర్పు నీరు విడుచు మేఁత
బట్టి దప్పడపుడు బడు ధరిత్రి
నణఁకు ముకు జెమర్చు వడిఁ దొమ్మ దాఁకినఁ
బసికిఁ బచ్చికిత్స వరగ వినుఁడు.

కం. త్రికటుకమున్ త్రిఫలమ్మును
నొక మానెడు చింతపులుసు నొగి మహిషపయః
ప్రకటరసమ్మున గొట్టెడు
ముకరత నిడఁ దొమ్మ తెవులు మొరుగున్ బసికిన్.

తే. ఎలుఁగునెత్తురు కరదూప మెలమి శుంఠి
పొడియుఁ గల్లుప్పు నల్లని వడువు మేక
పంచితమ్మున నిడఁ దీరు పసిఁడి కొఱ్ఱు
గంజియున్ గాఁకనీళ్లిడఁగా వలయును.

సీ. ఒరిగొమ్ము సంధిమపతి ? త్రొమ్ము ముక్కుపై
తోఁక క్రిందటఁ జూఁడ దొమ్మదిరుగు
నెరిడి దాఁకిన మేపు నీళ్లు నొల్లదు ముక్కుఁ
గొమ్ము లడ్డము పడు నిమ్ముగాఁగ
కొఱ్ఱు చూర్ణము సరి గూర్చిన కరదూప
మది సూనెతో నస్యమమరఁ జేసి
వెదురు టాకురసమ్ము వెసనిడ నది తిరు
పసపు గొత్తావాలు పొసఁగఁ బొడలు.

తే. సమములుగఁ గూర్చియిడె దరునమరఁ గలిసిఁ
గలయఁ గరదూపమున్ గింశుక ప్రసవము
లైన సున్నంబులైన గొంపు రనిడినఁ
దిరిసె పుంబట్టియావాలు నెరయ నుల్లి
రసముతోనైన నిడఁ దీఱు నెసఁగు వెలితి.

ఆ.వె. ఎలుఁగు నెత్తురైన నెలమి మోదుగు బువ్వ
లైనఁ గలిఁ బోసంగుపూని మూఁడు
తప్పలన్ని నాళ్లు తగఁ బశువులకిడఁ
బేరులేని రుజలు తీఱు వేగ.

కం. నల్లఁ బడి రొయుపుమానిన
నల్లదెవులు కింశుంబునన మజ్జిగయున్
దెల్లమిఁ గలినిడఁ దీఱున్
మొల్లమి దిరిశమ్ము మనుజ మూత్రము నటులన్.

ఆ.వె. అడ్డరసము వేము నా వాలు నల్లేరు
వేము నేలవేము వెలయ తిలలు
గుమ్మడిఫలమునను గూర్చిన నానల్ల
తెవులు మాని పసులు తేఱి బలియు

కం. అఱగడపుఁ బసికివెల్లు
ల్లరయఁగ నావాలు నుప్పనటు మజ్జిగతో
నల్లననొక పక్షంబిడ
నల్లననదిమాని పసరమనువుగ బ్రదుకున్

కం. వలికుట్టుల కుంజెలిమిడి గలయ
సమూలమ్ము నీళ్లఁ గ్రాఁచి కలియున
ట్లుల వరిచి శాలికెత్తిన వలిదొలఁగఁగ
బశువు దొంటి వైఖరి నడచున్

ఆ.వె. ఎద్దు కట్టుపట్టు వెలమిముక్కునడొక్క
కెఱఁగి నడుము చూఁడఁ బరిహరమగు
నౌషధమ్ము విడుచునగ్ని వైద్యమ్మున
నకులుననుజుఁ దలఁపనుకర మగును.

కం. కొఱనేలనీనిన పసికిఁ
దుఱిమిడియున్ వెదురుటాకు దోడ్తో మేపన్
నెఱచేపు నీనలేనెడ
మెరవడిగా వెదురుటాకు మేఁపిన నీనున్.

ఆ.వె. దూడఁ గుడువనీక తొడిఁ గట్టనీయని
జాడ నల్లఁదీగె దూడమేనఁ
బూసి నాకనీయ వాసి సాగె వత్సఁ
గుడువఁగట్టనిచ్చుఁ గోమరు మిగుల.

కం. వెలిదిబియ్యంబును గంజియు
పులకండము నెయ్యి పాలు పొలుపుగఁ దోడలన్
గలయంబాయఁగఁ దొలిచూ
లలవడఁగాఁ జేపు వ్యాధులన్నియు మానున్.

తే. నచ్చుదని నెత్తురోరలఁగ నొచ్చుఁ బసిక
బచ్చిబియ్యంబు కలిబూర్గు బంకతెస్న
దీర్ఘకేసర మనునట్టి తెవులుదవుల
వాత లిడఁ దగు నాయంబు వరుసతెలిసిఁగ.

కం. పొరిఁబొరి నెత్తురుగారిన
నరుదారఁగఁ దమిదె పిండి యంటిలిడఁదగున్
ధర నలికిరికాఁ ద్రైనన్
గరిమన్ గల్లుప్పు కింశుకము కలివలయున్.

ఆ.వె. మాడనొల్లనిదానికిఁ వేడుకలరఁ
నెన్గ నల్లేరు వెల్లుల్లి నెనయ వసయు
మిరియమున్ దక్రమును నిడమేక్షిదయనుఁ
వత్సకునకిచ్చు పాలునవ్వారిగాఁగ.

కం. నెరివెక్కుఁ దెవులునకుఁ గలి
మురువుగ భల్లూకమును
— —

కం. — —
— —
పుడమిన్ బ్రహ్లాదమతము పూనిక నిటులన్.

సీ. పుచ్చాకు వసయును ములుచల్లతోనిడ
మావి చిన్నది చేపు మానితముగ
రసిందిరి నెము పట్టురసమున మిరియాలు
మర్దించి మేదించి మూరు జెవినఁ
బోసినఁ గంటిలోఁ బూవు మానునిజంబుఁ
దొండాకు పసరున దొడవి యేఁడు
మిరియంపు గింజలు మేదించి కంటిలో
నిడఁబూవుమాని సొంపడరఁ బ్రబలు

తే. నెలమిఁగల్లుప్పు తాటి కాయలును జీల
కర్ర ను గంధిలతోడను గలయఁ బోయ
దూఁడగ్గె కొను నెయ్యి గోధుమ యవాగు
పోసినన్ జేపుచేఁగడు పొల్చుఁ బసులు.

కం. పల్లేరున్ గొంతిమర్లున్
వెల్లుల్లియు జీడిగింజ విను బొందుగపూ
వల్ల హరీతికి జరకర
మల్లనఁ గలి నిడిన సాధువగు దుష్టెందున్.

కం. ఇలఁ దగిరిశయు సమూలము
గలయఁగఁ గల్లుప్పు జీలకర సమములుగాఁ
బుల కండముతోఁ బెట్టినఁ
నలవడ గానెపుడు గొడ్డు టావున్ జేపున్.

సీ. పోసఁగఁ బాపరబంటి రసమును బచ్చిపా
లిడఁ జూలునిల్చు నెంతేనిగొడ్డు
టావులకైనఁ దోడ్తొ వెస మేకల
నెయ్యి వెట్టిన నైన నిలుచుఁ జూలు
పొడుచువాటికిఁ గంటనిడఁదగునూనె యౌ
న్నాళ్లలి సాధువై ననిచియుండు
... గుండె చివురుకు నొగిఁ గుంటుదానికి
మిరియపు గింజలు నిరువదొకటి

తే. చేరి తిప్పాకు రసముతో నూరి చెవినిఁ
బిండినంతన కుంటులు పేర్మిఁదేలు
కసవునందికి దిగదీసి మొసఁగఁ జేయ
దృష్టితాఁకుట పసులకుఁదీఱిపోవు.

చం. దిరిసెము వేము బారిజము తేకువ [illegible] సింధువారముల్
నెరవసరుల్ సమంబులుగ నేయియు నూనియ యాముదంబు న
ట్లిరయిక పొంగనీక కమలాగ్నిని దైల మొనర్చి పోసినన్
ధరఁ బశుజాలి వాయువులు దార్కొను వాపులు మాయు నన్నియున్.

కం. కందరసము పులిచల్లయుఁ
గందువతోఁ ద్రివిధ......గంటిని బోయన్
పొంది నముల్ వసులోఁ జెలుఁ
వందన్ బైలుఁటికి పశువు లల్లనఁ బ్రబలున్.

ఆ.వె. పేర్మి మావి పడమిఁ బేలాలపిండి పు
ళ్ళాకు రసము గూర్చి యనపకట్టు
తోడఁ ద్రిదినమిడిన వీడి నూవిలఁబడు
నటులఁ గామి కరగియైనఁ బడును.

ఆ.వె. పరగు మేడి చెక్క భారంగి పత్త్రాకు
వసము టల్ల నూనెపాసఁగఁగూర్చి
పొలుచుఁ ద్రిదినగణన పుళ్ళాకు కట్టడ
మాని యివురుగండె మహినిఁబడును.

సీ. కస్తుగుడ్లు గ్రుంగితోఁక న్వెంద్రులు వీడి
చిక్కుగువ్వ తెగులు చెందుపసికి
కల్లుప్పు నావాలు నల్లంబు కలుబంద
పలుకులు సమముగాఁ గలయఁ గ్రుమ్మ
పులిచల్ల కడవలోఁ బోసి జామొకటార
నిచ్చి త్రావఁగఁ బెట్టియిడిసినట్టి
తోఁక ఖండింపుచుఁ గాకనూనియనద్ది
నంతమాత్ర[నె తెవు?] లణఁగిపోవు

తే. పొసఁగ వెంపలి మూలంపు రసము నశ్వ
మమరఁ జేసిన దగ్గుతుమ్మపుడు మాను
నేలవేము నడ్డ సరము లీలఁ గలియు
నిడిన దగ్గులు తుమ్ములు కడఁక నణఁగు

కం. కలితో మోదుగ పువ్వుం
గలయఁ గఁ దిలపుష్పమిడినఁ గదలున్ దగ్గుల్
అల గుండె పగులు దీననె
తొలగు పసులకున్ జికిత్సతో డోజేయన్.

ఆ. గోనుపండ్ల రసము గోక్షీరమును నిడి
దూడమేనఁ బూయదూడ గొనును
కొమరులీవె గడ్డకూర్చుక తలవిరి
యాకు నూరియిడిన నవియు నటుల.

ఆ.వె. చెలిమిడాకు నూరి కలియఁ గల్లుప్పను
గలియఁ బూయ దూడ గజ్జిమాను
పరగ గంజవాకు పసరట్టి గుణమిచ్చు
నొడలు గడుగవలయు నొదవి పిదప.

ఆ.వె. ఒప్పు పద్మ కంద ముమ్మెత్త విత్తులు
జుట్టు పాకురసము సొరిది నటుల
పాలదొమ్మి చిన్నిపసికిఁ బ్రక్కలు చూడి
కలి పలాశకుసుమకలిత మిడుదు

కం. చెలఁది వినుపారులేగకు
నలవడ నూవేకు నూనెనద్ది తిన నిడన్
బలయు బ్రతి యాకు చిక్కలి
కలుపున్ గొట్టిడిడఁ గడుపు గట్టున్ వేగన్.

కం. పాలుగుడిచి కడుపారెడు
నాలేగకు మహిషదధియునటు వంజాకున్
లీలనిడ గట్ట గంజా
కాలీలన్ బెట్టఁ బాలుగలుగున్ బెలుచన్.

కం. తంగేడు కొనలున్ దధియఁ
బొసంగ నిడ నజీర్ణ మణఁగు సరవిం బెన్నే
రుంగడ్డయు గంజాయా
కుం గూర్చక నిడ నజీర్ణగుణములు మానున్.

తే. పరగ జొన్నలు వేపాకు బ్రత్తి గింజ
లుప్పు నిప్పుల నీఘూమ మొనర వీధిఁ
జల్లినంతన దృష్టిదోషములు దొలఁగు
మఱియు నిప్పులు జడిసిన నైరయుపేలు.

కం. ఈనంగలేని పసికిన్
బూనిక గురిగింజవేఱు పుల్లని కలితో
నూనె యిడి పొత్తికడుపున
మానక లేపనము సేయ మక్కువ నీనున్.

కం. సంగతి కుత్తుకవాప
య్యంగిటముల్ దీఱు కంఠమనువుగఁ జూడన్
పొంగు ముకుబంతి తలకై
క్కంగా మధ్యంబు నాభిఁ గలనస్య మగున్

సీ. మిరియంపుఁ బోడిజుట్టు పురిసంబు నిజవాత
ములు దీఱుఁ బనులకుఁ దల యొఱసిన
తలతిండి యాశృంగములఁ బుట్టు రోగంబు
తలవిసరుఁ బాధవాలక దొలఁగు
నావాలు చవిలెత్తు వెల్లుల్లి కొంతియు
గాలిమిడి పసరుతోఁ గూర్చి చెవుల
ముక్కున నిడఁ గర్ణముల నివ్వగట్టిన
శృంగ రోగంబు లణంగి పోవు.

ఆ.వె. కాళ్ల వీపురాక కదలమి యాడుసు
పచ్చిపాలు గావి పట్టు మిరెము
కూర్చి నాల్గు నాళ్లు గొట్టెడు పెట్టిన
రోగమణఁగి పసికి రూఢి మెఱయు.

చం. పదములు నాల్గుతుంటు లిలప్టైఁ బమసట్లుగ నోరగిల్లు మే
పొదవక చిక్కు నాకురమ కోపక జుట్టుపు లేఁగ కుత్తుకన్
దుదిఁ గరశల్యముఙ్ జలివితోడుత [గూడ?] శరీరమెల్ల నొ
ప్పిదపుఁ గరీష భస్మముటఁ బేర్మిగ నించినఁ దీఱునయ్యెడన్.

ఆ.వె. ఆవటువుఁ దీగతోఁ జెప్పతిట్టయైన
కంఠమునఁ గట్టి పిడకలఁ గల్గినట్టి
బూదె మెయినిండఁ జమరినఁ బోవు కురుప
జాలు కుంటెడు పసులకు లీలతోడ.

కం. జిల్లేడు కొనలు ముక్కుల
నల్లల్లనఁ జొనిపి తీసినంతన తీఱున్
తెల్లమిగ పెత్తగాల్దురు
వెల్లనఁ జక్కరయుఁ గరగఁ బేర్మిన్ దనరున్.

తే. క్రొత్త సున్నంబుతోడి కా గూర్చి పొదిచి
గిరుక నిడుక గఱంచిన మెఱయుఁ గాళ్ల
కడుపు శూలకుఁ బసి ముందుకాళ్ల క్రింద
దొడరి ముసలమ్ము నలుమారు దూరవేయ.

సీ. చండి కుంటుకువెన్క చరణము గొరిజ
విడఁగఁగ గొట్టి నీళ్లనిడఁగఁ దొలఁగు
దివసమా కుంటుకు దెస నేడు క్రేల్చూఁడు
కావేసి నర్క దుగ్ధములు నించు

డెన్నులఁ గడుపుబ్బ నిల్వ్రాత దంటు బూ
దియనీళ్లు ద్రావించి దృష్టి నిడుఁడు
మఱి యుబ్బ లిసి పందిసులము నీళ్లిడఁదీఱు
నిరు వాయిగట్టి నీపిరి నెడలమి

తే. కలియము గురుగింజ పసపుతోఁ జులుక నగును
దురియ కిచ్చినఁ బ్రేవులు దునియఁబారు
చేరివానికిఁ దంగేడు చిపురునూరి
చల్లతో నిడ నవిమాను సరసముగను.

కం. బారిజ పాకును మిరియము
నీరధి లవణమ్ము నూరి నెరి నిడినన్ బ్రాం
పాకుత్తరేణు వెల్లు
ల్లారసి నిడ వ్రణములెల్ల నడఁగున్ బసికిన్.

తే. ఉత్తరేణాకు వెల్లుల్లి యుప్పు మిరెము
నూరియిడఁ బుర్వు చచ్చివేయారు వ్రణము
కాకి యాగయుఁ దజ్జిహ్వ దాఁకనీక
పదిల మొనరించిరేనియు వ్రణము లణఁగు.

ఆ.వె. పలుగు రాళ్లకాల్చి పరగఁ జూఁడినఁ గంతి
పగిలి మిగులఁ బలుచఁబాఱి యణఁగు
కడఁక నట్టి వృశ్చికమునకు గచ్చపా
దయును మిరెము కలిక సుయినఁదీఱు.

ఆ.వె. కడఁగి రేలకాయగంధమ్ము కలియిడఁ
బురువు కాటుదేరు పురువులంటి
నెండ వానకోర్వ దిట్టట్టు వడు ఖార
మోర్వదూర్పదట్టి మొదవుఁ బసికి.

కం. ఆవిషము లెల్లఁ దీఱున్
బావనమగు నడ్డసరపుఁ బసరును మిరియం
బావునెయి శొంఠి పసపున్
బావకపక్వముగ వేఁపువల నిడి నంతన్.

వ. అనిన విని కౌతూహలాయత్తచిత్తులై శౌనకాదు లత్త పోవిత్తకంఠీరవుండగు రోమహర్షణి నిరీక్షించి స్వప్నలక్షణం బెఱింగింపు మనిన నతండు——

సీ. పంచీకృతంబైనఁ బాంచభౌతికమగు
స్థూల గాత్రమ్మున లీలసాత్త్వి
కంబు జాగ్రదవస్థఁ గలుగు షోడశవికా
రముల లింగశరీర మమర రాజ
సాహంకృతియు స్వప్నమగు కారణాఖ్య ను
దమముచే స్వాపమా క్రమముతోడ
విశ్వతైజసులన వెలయఁ బ్రాజ్ఞుండన
నాత్మలొప్పగు నిట్టిదగు నవస్థ

తే.గీ. లను ప్రమాణమ్ములను సూక్ష్మతనువు వాయ
దనఘ పరమాత్మయెడఁ జెందునంత దనుక
కారణ శరీర మెడయగు కలయఁబోలయఁ
గానఁ జిత్సుఖ మాస్వాపగతిఁ బొసఁగు.

తే. స్వప్నమింద్రియ దశక హృత్సంయుతైక
ప్రాణ పంచక సర్వ ప్రపంచకమగు
కంఠ హృన్నాభి గుదములఁ గదలు నాయు
దానముఖ్య చతుష్కమౌ ప్రాణగతులు.

కం. వ్యానుఁడు సర్వశరీర
స్థానవ్యాపకుఁడు గాన సకలేంద్రియములన్
వాని వెనుదవులు నెందున్
గానన్ దలఁచినవి విన్న కన్నవవెల్లన్.

చం. కనుపడినట్లు సూక్ష్మతను కారణమై కనుపట్టి నట్టివిన్
వినుఁడవి రాజస ప్రకృతి వింతగఁ బైత్య గుణోల్బణమ్మునన్
గనునవి పుష్యమాసమునఁ గల్గు ననేకవిధంబు లట్టివిన్
దినములుగా కలల్ గలవు దీని నెఱుంగఁదగున్ ఫలోన్నతిన్.

ఆ.వె. బొంకు పలుకునతఁడు పొసఁగఁ గన్గొనుకల
రోగజన్య మదియు రూఢికెక్క
దందు వరుస నాలుగగు జాల యందష్ట
షష్టిమాస ఫలద శాస్త్రి మరయ.

కం. పనుల విడుచునెడఁ గనుకల
పొసఁగన్ నాల్గైదునాళ్ల బూనిక ఫలద
వ్యసనము సర్వము కుడిభుజ
మొసఁగఁ గలవఁ గనిన శుభము లెంతేయుఁ గల్గున్.

సీ. హస్త్యశ్వరథడోలి కాందోళికలువెన్క
నడవఁగఁ బ్రభువులు గడలుదేలు
రక్తధార లమేయరత్నముల్ పశుగణ
బ్రాహ్మణులన్ గన్నఁ బరమశుభము
జలగ పామునుదేలు నెలమినంటఁగఁగన్న
భార్య ప్రియంబాడ బావిఁబడఁగఁ
గన్నెలఁ జూడఁగ ఘనసౌధ గిరులపై
జనులఁ గూడుండఁగ జలధిదరిని

తే. నుండఁగాఁ గలఁ గన్న వేశ్యాకరిదాస్య
మమరునట్టుగ వ్రణగాత్రు నధికహర్మ్య
ధన కనక శ్రేష్ఠవనములఁ గనుటలెస్స
శయ్యనుండంగఁ గలఁ గన్న సౌఖ్య మొదవు.

చ. లకుముకి కోడి క్రౌంచ మొకలావుక గన్గొన నన్ని సిల్వఁగాఁ
బ్రకటిత వాహనస్థితులఁ బాడుగృహమ్ములలో సుఖాసన
ప్రకరములన్ వసింప స్ఫుటపంకజపాండుర వస్తువున్ గనన్
మకర విభూతియున్ శుభము శోభనమున్ గలుగున్ గ్రమంబునన్.

కం. నీలాంబర సుమభూషణ
జాలాన్విత సతులఁ గనిన సరితాఁదాల్పన్
లీలన్ సూర్యుఁడు చందురుఁ
బోలన్ గలగనిన రోగపుంజము లూడవున్.

ఆ.వె. కొమ్ములున్న మృగకులమ్మునఁ బలుకోఁతి
నటు సివంగి నెగయునట్టి పక్షి
నంత్య దుష్టజనుల నంబు వర్షము జల
మింకఁగనెడు కలల నెసఁగు కీఁడు.

ఆ.వె. నలుగు బెట్టఁగనిన సల్లనై తెల్లని
వస్త్ర చయములున్న వడువుగనిన
రక్తపుష్ప గంధరాజిఁ గన్గొనఁ గీఁడు
కనని వినని కాంతఁ గవయ గ్రహము.

సీ. మొండి ముక్కుడి వాండ్ర దండహస్తులఁ
బాశఖడ్గ సంభృతుల విశారతనుల
చెట్టు గొట్టగనెండు చెట్టువెన్నయు నెయ్యి
పెరుగు తైలాంగుల ఖర ముఖగత

కాక గృధ్రమ్ములఁ గాష్ఠ పంకమ్ముల
దుర్లక్షణమ్ములతోన వెలఁగఁ
దానంబు సేయంగఁ దైలాంగుఁ డగుటయు
హోమకుండము తేరు భూమిమిట్టు

తే. పుట్టు సౌధంబు నొంటిగాఁ బొల్చియొక్క
క్రొత్త మోఁక ధరింపఁగఁ గోరియొకరు
పలుమఱును బిల్వఁ దానవ్వఁ గలఁగనిన
శోక భయపీడ చింతనా నీకమొదవు.

కం. పచ్చని కోకలు సొమ్ములు
నచ్చఁగఁగల చెలులఁ గనిన నదిసంపద శా
నిచ్చలు వృతి [గతు ?] కుణపము
నెచ్చఁగఁ గనుగొనుటంఁ గల్గు నెంతయు శుభముల్.

తే. అన్నముల్ భక్ష్యములు దీని నట్టులారులు
తినఁగఁ గనినట్లు సైరిభోష్ట్రి నవ గార్ద
భయుత రథమెక్కినట్లుఁగఁ బాత్రనీళ్ల
ముంచఁజేరఁగఁగల గన్న మొనయుగీఁడు.

కం. వననిధి పొంగుచు నింకఁగఁ
గనుకల నాశంబు బంధుగణ నాశముగుల్
ఘననృత్త గీత వాద్యము
విను నూతనభాండ తామ్రవీక్షలు కీఁడుల్.

తే. తొండలల్ గూరమల్లను బండుటాకు
పాలపటిీయుఁ గాకి గన్పట్టు చెట్టు
ఘృతము పరమాన్న భోజనోద్వృత్తి పొగయు
బీడుకొలను గలం గనఁ గీఁడులావవు.

సీ. సంశ్లిష్ట బంధన సంతాప మొనఁగూర్చు
కోరి ముత్తెముగన్న కొడుకు గలుగు
మశక మక్షికముల మత్స్య మాంసమ్ములఁ
గలఁగన్న సంపదల్ గలిగి వెలయు
మందివారలఁ జూడ మంచిది చేకుఱు
మంటఁ గన్గొన శుభ మహిమఁదనరు
నమితపాద ముఖావయవ దేవతలఁ గన్న
దేవతార్చనలు తత్సేవఁ గనుట

తే. కాల సుఖములు నారోగ్య ఖేలలాదవు
నిట్టి స్వప్న ఫలమ్ముల నింగితమతి
వెలయ జనులు శుభా శుభకలిత గతులు
తెలియ నిహపర సౌఖ్యముల్ గలుగు నెలమి.

వ. ఇట్టి స్వప్న లక్షణమ్ములు రోగనిదానమ్ములు నెఱింగి నిశ్చంకాగదంకారులు సాధ్యా సాధ్యాంక నిర్ణయులై దేశకాల ప్రకృతి విశేషమ్ములు దెలిసి ఋజు మార్గంబునఁ బ్రతిక్రియం బూనవలయు నింక శిల్పశాస్త్రిం బెఱింగించెద—

కం. హరిహర మందిర రథస
త్వరవిగ్రహ చిత్రకర్మ వాసవిధంబుల్
ధరగృహ గోపుర నిర్ణయ
సరణిగా వివరించు శిల్పశాస్త్రము వెలయన్.

చం. వరుసగ నొక్కటాది పదిపాల్తుద తాళ విసంజ్ఞ మూర్ధవి
స్తరతను మానభేదకవిధానము సింహతలాట భూతి భీ
కరతల సాలభంజి పృథుక ద్విర దానన యక్షమర్త్యులన్
సురగిరి జాకృతుల్ మురహ శూలి విధాతృ శుభాంగ భాగముల్.

సీ. ఇట్టి యంశములయందేకభాగ శిరము
నవలి భాగములు కాయంబుగాఁగ
దారు ద్రుమ పార్శ్వ చిత్రముల నేతద్విధ
జాతి రూపము లొప్ప ఖ్యాతిదేవ
తాకృతులకు మితిగైకొని యిది నూట
యిరువదినాల్గు పాళ్లెసఁగ నందు
నుష్ణీష మకుటమ్ము లొనర షడ్భాగమ్ము
లగు రెండు కేశనేత్రాంతరమ్ము

ఆ.వె. ముక్కు తలయు హనువు నిక్కప యట్లన
యందునుండిచుబుక మూఁడు పాళ్లు
దానగళము సగము దగనాల్గు పాళ్లు వ
క్షంబు ద్వాదశాంశ సరణి నాభి.

ఆ.వె. నాభిదిగువ మేహనం బూరుపర్యంత
మమరునట్టి యంశలలరు తాళ
కాంశ జానులొప్పు నటయుగాంశము జంఘ
లడుగు లొనరు వలన నాఱుపాళ్లు.

కం. పాదాంగుష్ఠము పార్ష్ణియను
మొదలగ సప్తదశభాగములఁదగు పాదం
బాదిగ భాంశంబుల నొలి
పైదగు కూర్పరము బాహు లవి శాస్త్రోక్తిన్.

తే. అమర మణికట్టు దనుక నందైదుపాళ్లు
నదము ? నాంపాళ్లదగు ప్రకోష్ఠమున మిగుల
నలరు మధ్యాంగుళాగ్రాంశ లనటు నాల్గు
వెడలు పఱచేత మూఁడుపాళ్లడరవలయు.

సీ. పండ్రెండు తొమ్మిదిపాళ్ల గ్రీవాగ్రంబు
గ్రీవమూలము వెడల్పు విధమున
బాహ్వాది మూర్ధ్ని పాళ్ల తదగ్రంబు
రెండు నాలుగునైదు రీతి ప్రక్క
లటు తొమ్మిసార్ధ వేదాంశము వెడలుపు
నా క్రిందఁ ద్రిత్రిద్వయాంశకమ్ము
నడుము ద్వయాష్టాంశ మడరునంగంబుల
నిడివిని తగు వెడల్పిడుటు చిత్రము

ఆ.వె. స్త్రీ ప్రతిమల కిట్టి స్థితిని ముప్పాతిక
పాలు పరక కొదవఁ బాడిగాఁగ
నేయ టొప్పు నిట్లు చెలువున దేవత
తత్స్వరూప యుక్తిఁ దరల దెపుడు.

ఆ.వె. తనకు వలయునంత ధరనాల్గు దిక్కులు
సమముగాఁగఁ గొలిచి యమరదాని
ద్వ్యష్ట కోష్ఠములుగ నంశకమ్ము లొనరించి
నడిమి నాల్గు బ్రహ్మ కిడి క్రమమున.

సీ. ఉన్న పండ్రెండు పాళ్లొప్ప రాను లొనర్చి
తనరాశి నైనను దానఁజేసి
దైన వర్గువునైన నభవదిశాదిగాఁ
దనదిక్కు వైరంబు తలఁగ కునికి
యలవడ సింహాధ్వ జాలయ తూణముల
వాస్తువు గావించి శస్తమహిమ
షడ్భాగ సమము హస్తమ్మునఁ గొల్చిద్వా
రము లుంచఁగాఁ దగు రమ్యముగను

ఆ.వె. భాద్రపదము మొదలు ప్రాగాది మూఁడేసి
నెలలు వాస్తు పురుషుఁ డలరు నాల్గు
దిశల నతని చరణ దిశ సూర్యుఁడుండుట
తెలిసి నిడిని వాస్తు లిడఁగ వలయు.

కం. గృహమునకు వలయు ధారుణి
వహి నిర్వ దెనిమిది పాళ్లు వాస్తు పురుషుఁడో
రహిఁ బదునొండూర్ధ్వాంగము
విహితతఁ బదియారు క్రింద వీటికి నడుమన్.

తే. ఏక భాగమ్ము నిడివియా తెలిఁగి యచట
శంఖు స్థాపింపఁ దొలఁగును జంద్రజీవు
లున్న రాసులునవి నిల్పుటొప్పు మిగుల
వాస్తు పురుషుని నెఱుఁగఁగ వలయునిట్లు.

ఆ.వె. బుధుని రాశి వాసపోసి శుక్రుని రాశి
కప్పుగప్పె నేనిఁ గలుగు శుభము
స్తంభమును ధరణిఁ ద్రవ్వుచో నుముకయుఁ
గోశచయముచూడఁ గెఁదులాదవు.

సీ. అందుదకమునించి యలరువోయఁగను
ప్రదక్షిణమైనచోఁ దగు శుభములు
నిండ కుండిన తెస్స నైరి నప్రదక్షిణ
మైన కారాదట్టు లరయ వలయు
శ్రవణార్ద్రు లుత్తరాత్రయ శతభిషపుష్య
వసు పంకజములు నూర్ధ్వములు భరణి
యాశ్లేష పూర్వత్రయము మూలమఖకృత్తి
కా విశాఖ లధోముఖములు జ్యేష్ఠ

తే. యశ్వినీ పునర్వసుల మృగహస్త రేవ
తులు ననూరాధ స్వాతి చిత్రలును దిర్య
గానన ములందు ఘాత కృత్యము ప్రచార
గతులు తిర్యక్కులను బూన ఘనఫలమ్ము.

కం. ఓడల బండుల లీవెల
జాడలు నవియూర్ధ్వములఁ బ్రశస్తము సస్య
క్రీడారామ గృహక్రియ
లాడక నిమ్నాడ్కే నేయ నురుశుభములగున్.

మ. శరదంభోరుహపత్రనేత్ర ! కలుషాచారామరారీశవి
స్తర సైన్యాటవి వీతిహోత్ర ! దివిషత్పాలాసురజ్యేష్ఠ శం
కరయక్షోరగ సిద్ధ సాధ్య మునిసంఘస్తోత్ర చారిత్ర ! శం
బరద శ్యామల వర్ణగాత్ర ! యలమేల్మంగా కళత్రా ! హరీ.

కం. శరచర కచ్ఛప కిటినర
హరివామనరామరామ హలధర బుద్ధో
ద్ధర తురగవారారోహక
హరహరి విధివినుతి పాత్ర హరిహర నేత్రా.

పంచచామరము. మురాసురారి వీరఘోర మూర్ధ పంక్తిఖండనా !
హరాజ రాజ మౌనిశేఖరార్చన ప్రతోషణా !
చిరంతన ప్రసిద్ధ శుద్ధ సేవకౌఘ పోషణా !
సరోజరోప కోటిరూప ! సారరమ్య భాషణా !

గద్య॥ ఇది శ్రీమదలమేల్మంగా వేంకటేశ్వర వరప్రసాదా శుకవితా విచిత్ర మహంకాళ్యప్ప కొండార్య పుత్ర సకలసుకవిస్తోత్ర పవిత్రగాత్ర వినయగుణానునయ వేంగయకవి సహాయ తేకుమళ్లాన్వయ పయఃపాథోధి పూర్ణసుధాకర తిమ్మమాంబాక ప్రయామాత్యకుమార సకలవిద్వజ్జనాధార శ్రీవత్సగోత్ర పవిత్ర తాపస్తంబ సూత్ర సత్కవిప్రమోదానుసంధాయి రంగశాయిప్రణీతంబైన శ్రీ వాణీవిలాసవనమాలిక యను మహాప్రబంధంబునందు, ఆయుర్వేద ధనుర్వేద గాంధర్వవేదంబు లెఱింగించుటయుఁ దర్కదండనీతి సాంఖ్యయోగ పూర్వమీమాంసోత్తరమీమాంసాది షట్ఛాస్త్ర ప్రశంసయు భరతశాస్త్ర కళాశాస్త్రాలంకారశాస్త్ర శిల్పశాస్త్ర గజలక్షణాశ్వలక్షణ పశులక్షణ రత్నలక్షణ సాముద్రికలక్షణ గణితలక్షణాద్యుపశాస్త్ర వివరణంబును స్వప్నాధ్యాయ ప్రశంసయు నను కథలంగలది చతుర్థాశ్వాసము.

సంపూర్ణము.